శ్రీః

# ధర్మమఞ్జరీ

## ధర్మప్రశంసా-ధనవర్ణనమ్-కామమీమాంసా

సంస్కృతమూలమ్

శ్రీ బెల్లంకొండ రామరాయకవీన్ద్రః

ఆంధ్రానువాదము

సాహిత్యశిరోమణి, ధర్మపురి శేషగిరిశర్మ, సంస్కృత పండితుడు,
మునిసిపల్ హైస్కూల్, నరసరావుపేట



ప్రకాశకులు



సాధన గ్రంథ మండలి, తెనాలి



వెల : 25-00

శ్రీః

# ధర్మమఞ్జరీ

## ధర్మప్రశంసా-ధనవర్ణనమ్-కామమీమాంసా

సంస్కృతమూలమ్
శ్రీ బెల్లంకొండ రామరాయకవీన్ద్రః
ఆంధ్రానువాదము
సాహిత్యశిరోమణి, ధర్మపురి శేషగిరిశర్మ, సంస్కృత పండితుడు,
మునిసిపల్ హైస్కూల్, సరసరావుపేట



ప్రకాశకులు



సాధన గ్రంథ మండలి, తెనాలి



వెల : 25-00

శ్రీః

# ధర్మమఞ్జరీ

## ధర్మప్రశంసా-ధనవర్ణనమ్-కామమీమాంసా

సంస్కృతమూలమ్

**శ్రీ బెల్లంకొండ రామరాయకవీన్ద్రః**

ఆంధ్రానువాదము

సాహిత్యశిరోమణి, **ధర్మపురి శేషగిరిశర్మ**, సంస్కృత పండితుడు,
మునిసిపల్ హైస్కూల్, నరసరావుపేట

ప్రథమముద్రణ :-01.05.2006 - వ్యయనామసంవత్సరమ్
ప్రతులు : 1000
పేజీలు : 84
వెల రూ. : 25-00



DTP by
**VIKRAM GRAPHICS**
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 233242

Printed at :

3

# మండలి మాట

'ధర్మార్థకామమోక్షము'లను పురుషార్థములలో మొదటి మూడింటికి త్రివర్గమని పేరు. ధర్మప్రశంసా, ధనవర్ణనమ్, కామమీమాంసా అను పేర వాటికి సరళసంస్కృతమున వెలయించినవారు అపరశంకరులు, శ్రీ హయగ్రీవోపాసకులు, శతాధికగ్రన్థకర్త యగు శ్రీ బెల్లంకొండరామరాయ విద్వత్కవి. వీటికి చక్కని ఆన్ధ్రానువాదం చేసిన వారు శ్రీ ధర్మపురి శేషగిరిశర్మగారు. ప్రస్తుతము శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులుగా శ్రీ చిదానంద భారతీస్వామి నామమున ప్రకాశించుచున్నారు. మా మండలి తరుపున పునర్ముద్రించుటకు అనుమతించి ప్రోత్సహించిన శ్రీ స్వామివారికి సాష్టాంగప్రణామములు ఆచరించుచున్నాను.

పురుషార్థసాధనయే 'జీవ' లక్షము. సంస్కృతమున వీటిని బెల్లంకొండ వారు అందించుట, వాటికి చక్కని ఆన్ధ్రానువాదమును శ్రీ ధర్మపురి శేషగిరిశర్మగారు చేయుట ఆన్ధ్రదేశమునందలి పండితపామరులిరువురు అవగాహన చేసుకొనుటకు, ఆచరించుటకు తోడ్పడుననుటలో యెటువంటి సందియము లేదు.

'ధర్మమంజరీ' పేరున వెలువడుతున్న ఈ గ్రన్థమునకు చక్కని పీఠికనందించిన వారు డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు. వీరు యస్.జి.వి.ఓ.కాలేజి, తిమ్మసముద్రము నందు సంస్కృతశాఖాధిపతిగా పనిచేయుచున్నారు. వీరికి శ్రీ హయగ్రీవభగవానుడు శుభాశీస్సులు అందజేయుగాక!

ఇక ఈ గ్రన్థము పుస్తకరూపము సంతరించుకొనుటకు తోడ్పడిన వారు, మండలి ప్రచురణలకు అండదండగా నున్నవారు శ్రీ 'రావి మోహనరావు'గారు. వీరికి శ్రీ హయగ్రీవభగవానుడు ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక.

శుభం భూయాత్

ఇట్లు

బుధజనవిధేయుడు

**బులుసు సూర్యప్రకాశశాస్త్రి**

వ్యవస్థాపకుడు,

సాధన గ్రన్థమండలి, తెనాలి.

4

శ్రీః

శ్రీరామశ్శరణం మమ

శ్రీశ్రీశ్రీ జగద్గురు ఆదిశంకరాచార్య స్వామివారు ఇతర మతఖణ్ణన పురస్సరముగ అద్వైతమత స్థాపన చేయుటకు పణ్డితులకు ఉపయోగపడునట్లుగా ప్రౌఢములగు భాష్యములను రచియించియు, ఇతర మతఖణ్ణనముతో పనిలేని సామాన్యులకు కూడా సులభముగా అద్వైతజ్ఞానమును అనుగ్రహించుటకొరకు వివేకచూడామణి, భజగోవిందశ్లోకములు మొదలగా కల అనేక లఘుగ్రన్థములను, స్తోత్ర గ్రన్థములను కూడా రచియించిరి. ఆదిశంకరుల అపరావతాగముగ ప్రసిద్ధులైన శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారు కూడా ఆదిశంకరులవలె పండితులకొరకు భగవద్గీతా భాష్యార్క ప్రకాశము, శంకరాశంకరభాష్య విమర్శము, వేదాంతముక్తావళీ, సిద్ధాన్తసింధువు మొదలగు ఉద్గ్రన్థములను రచియించియు సామాన్యులను కూడ అనుగ్రహించుటకు అతిసులభములగు కొన్ని చిన్న గ్రంథములను, అనేక స్తోత్రగ్రన్థములను కూడా రచియించిరి. ధర్మప్రశంసా, ధనవర్ధనమ్, కామమీమాంసా అను గ్రన్థములు ఆ కోవలోనివే. ఇవి ఎంతయో సరళమైన గ్రన్థములు అయినప్పటికి సంస్కృతము చదివికొనిన వారికి మాత్రమే సరళములు. సంస్కృతభాషాపరిజ్ఞానము లేనివారికి భోదపడవు కదా! ఈ లోపమును పూరించుటకో యనునట్టు బ్రహ్మశ్రీ వేదమూర్తులు శ్రీ ధర్మపురి శేషగిరిశర్మగారు (ప్రస్తుతము సన్యసించి గన్నవరంలో భువనేశ్వరీ పీఠాధిపతులుగా శ్రీ చిదానందభారతీస్వామిగా ప్రకాశిస్తున్నారు). ఈ గ్రన్థములకు చక్కని ఆన్ధ్రానువాదము కూడా చేసినారు. కావుననే అవి మరింత సరళమై ఆన్ధ్రదేశమునకు బాగుగా ఉపయోగపడుచున్నవి.

శ్రీ బెల్లంకొండ రామారావుగారు ముప్పది ఎనిమిది సంవత్సరములు మాత్రమే (1875-1914) జీవించి జీవన్ముక్తులైనారు. ఈ స్వల్ప జీవన కాలములోనే కొంత భాగము తపస్సు చేసినారు. మరికొంత భాగమును విద్యార్థులకు విద్యాదానము చేయుటకు కేటాయించినారు. మిగిలిన అతిస్వల్పకాలములో నూట యేబది గ్రన్థములు రచియించినారు. వారి జీవన కాలములో నాలుగైదు గ్రన్థములు తప్ప మిగిలినవి ముద్రణకు నోచుకోలేదు. గ్రన్థముద్రణపై కొంత శ్రద్ధ చూపవలసినదిగా సన్నిహితులు సూచించగా వారు చెప్పిన మాటలు ఇవి.

"కాళిదాసాదులు ముద్రణాలయములను సిద్ధము చేసికొని గ్రన్థములను వ్రాయలేదు. అయినను ఆ గ్రన్థములలో జీవము కలదు కనుకనే అవి ఈనాటివరకు

నిలచియున్నవి. అట్లే నా గ్రన్థములలో కూడా జీవమున్న యెడల అవి తప్పక నిలుచును. జీవము లేకున్న కాలగర్భములో కలసిపోవును. ఎట్లైనను నాకు బాధలేదు. నేను నా సమయమును మాత్రము ముద్రణకు ఉపయోగించను. గ్రన్థరచనకే ఉపయోగింతును". మరియును ఇన్ని గ్రన్థములను రచియించిన శ్రీ బెల్లంకొండ రామారావుగారు ఏ గ్రన్థములోను తానే గ్రన్థమును రచియించినట్లు చెప్పుకొనక శ్రీ హయగ్రీవ భగవానుడే తనద్వారా ఆయా గ్రన్థములను రచియించినట్లుగ చెప్పుకొనెను. ఆయన జీవన చరిత్ర పఠియించిన వారలకు ఇది ముమ్మాటికి సత్యమని తెలియును. శ్రీ బెల్లంకొండ రామారావుగారు విదేహముక్తులైన తరువాత అర్ధ శతాబ్ధము పిమ్మట బ్రహ్మశ్రీ కవితా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రామారావుగారి మాహాత్మ్యమును తెలిసికొని తన జీవితకాలమునంతటిని ఉపయోగించి ఎన్నో వ్యయ ప్రయాసములకోర్చి వారి గ్రన్థములనన్నింటిని చాలావరకు ముద్రించిరి. నిజముగ శ్రీ హయగ్రీవానుగ్రహము లేనిదే ఇది సాధ్యపడదు. 'శ్రీ హయగ్రీవస్వామి బెల్లంకొండ రామరాయకవి హృదయములో ఉండి ఆయన ద్వారా గ్రన్థములను రచియించి శ్రీ కవితా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి హృదయములో వుండి గ్రన్థములను ముద్రించెను' అనునది నా సంపూర్ణ విశ్వాసము.

శ్రీ రావిమోహనరావుగారును ప్రస్తుత కాలమునందు శ్రీ బెల్లంకొండ రామారావుగారి గ్రన్థముల అనుపలభ్యతను గమనించి అనేక గ్రన్థములను పునర్ముద్రణ చేయుచున్నారు. అందువలననే శ్రీ రావిమోహనరావుగారి యందును శ్రీ హయగ్రీవ స్వామి అనుగ్రహము కలదని నా విశ్వాసము. లేనియెడల ఇటువంటి పనులయందు ఆసక్తి జనించునా! ప్రస్తుతము శ్రీ రామారావుగారిచే రచించబడిన ధర్మప్రశంసా, ధనవర్ణనమ్, కామమీమాంసా అను మూడుచిన్న గ్రన్థములు శ్రీ ధర్మపురి శేషగిరిశర్మగారి ఆన్ధ్రానువాదములో కలసి ధర్మమఞ్జరీ అను పేరుతో శ్రీ రావిమోహనరావుగారి ద్వారా పునర్ముద్రణ చేసి ప్రకాశింపబడుచున్నవి. ధర్మార్ధకామమోక్షరూపములైన పురుషార్థములలో మొదటి మూడింటిని త్రివర్గము అని అందురు. వాటి ప్రాధాన్యమును,ప్రాశస్త్యమును ఈ గ్రన్థములు తెలియజేయును.

## -ధర్మ ప్రశంసా-

ఇందు ధర్మ ప్రశంసా అను గ్రన్థము నందు ధర్మము యొక్క గొప్పదనము చెప్పబడినది. ధర్మార్ధకామ మోక్షస్వరూపములగు పురుషార్థములు నాలుగు. మానవుని శ్రేయస్సులకు సాధనముగ వేదములచే చెప్పబడిన కర్మలను ధర్మము అని అందురు. ఈ ధర్మమును సకామముగా ఆచరించిన అర్థకామములును,

నిష్కామముగా ఆచరించిన మోక్షమును లభించును. ఇట్లు అర్థకామ మోక్షరూపములగు ఇతర పురుషార్థములకు కూడా సాధనమగుటచే ధర్మము చాలా శ్రేష్ఠమైనదిగా చెప్పబడుచున్నది. అర్థా గృహే నివర్తంతే శ్మశానే మిత్రభాన్ధవాః! - సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్తమనుగచ్ఛతః॥ అని చెప్పినటుల మానవుడు ఈ లోకము నందు ఎంత సంపాదించినను మరణించిన పిదప తనవెంట తీసికొని వెళ్లునది ధర్మాధర్మములనే గదా! కాని ధర్మము యొక్క స్వరూపము తెలిసికొనుట చాలా కష్టము. వేదములచే చెప్పబడినదియే ధర్మము అయినప్పటికి ఆ వేదము ఏ ఆశయముతో ఎవరిని ఉద్దేశించి ఏ ధర్మము చెప్పినదో తెలిసికొనుట సామాన్యులకు కష్టము. కనుకనే దానిని వివరించి చెప్పువారలు అవసరము. శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారు ఈ గ్రన్థమునందు కొన్ని ధర్మములను వివరించుచూ ఇతర ధర్మముల స్వరూపమును స్వయముగా తెలిసికొను మార్గమును తెలిపినారు. ఉదాహరణమునకు :

"ఋతౌ భార్యాముపేయాత్" అని వేదముచే విధించబడుటచే ఋతుకాలము నందు భార్యను సంగమించుట ధర్మము. నిషిద్ధ కాలములందు భార్యను సంగమించుట అధర్మము అగును. రాజులకు ప్రజాపాలన ధర్మము. ప్రజలకు పన్నులను కట్టుట ధర్మము. ధనమును సంపాదించి భార్యాపుత్రాదులను పోషించుట భర్తకు ధర్మము. శిష్యులకు చదువుచెప్పుట గురువుల ధర్మము. గురువులకు గురుదక్షిణ ఇచ్చుట శిష్యుల ధర్మము. ఈ విధముగా ఒక్కొక్కరకు ఒక్కొక్క ధర్మము ఉండును. అంతేగాని ధర్మము సార్వకాలికము, సార్వజనీనమైనదిగా ఉండదు. ఈ ధర్మమును ఆచరించుటతోనే లోకము నిలుచును. ఈ ధర్మమే ఇతర పురుషార్థములకు కూడా సాధనమగును. ఈ విధముగా అనేక ధర్మములు, వాటి ప్రాధాన్యత ఇందు వివరించబడినవి.

## - ధనవర్ణనమ్ -

పూర్వము పరీక్షిన్మహారాజు కలిపురుషునకు స్త్రీలు, జూదము, మద్యపానము, హింస అను నాలుగు స్థానములను ఈయగా తృప్తి చెందని కలిపురుషుడు మరియొక్క స్థానము నీయమని ప్రార్థించెను. అప్పుడు పరీక్షిన్మహారాజు ధనము అను అయిదవ స్థానమును కూడా కలికి యొసంగెను. అప్పుడు కలి తృప్తి చెంది అది మొదలుకొని ఆ అయిదింటిని ఆశ్రయించి వాటితో సంబంధము కలిగినవారలను భ్రష్టులను చేయుచున్నాడు అని భాగవతము చెప్పుచున్నది. చివరిసారిగా పరీక్షిన్మహారాజుచే యొసంగబడినదైనప్పటికి ధనము కలిపురుషునకు

ప్రధానమైన ఆశ్రయమైనది. దానిని ఆశ్రయించి కలి సర్వులను భ్రష్టులను చేయుచున్నాడు. **"మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః"** అని అనినట్లుగా ధనము తల్లీ, కొడుకులకు కూడా విరోధము కలుగజేయును అనగా ఇతరుల విషయమున చెప్పనది ఏమియున్నది? వేశ్యా సంగమము, మద్యపానము, జూదము మొదలగు దుర్వ్యసనములకు కూడా ధనమే కారణమగుచున్నది.

వాస్తవమునకు విచారణ చేసి చూచిన ధనము మానవునకు స్వల్పముగ కూడా సుఖమును ఈయలేదు సరికదా! మరింతగా ఎల్లప్పుడు బాధలనే యొసంగును. ఎట్లనగా ధనము సంపాదించునప్పుడు కష్టమునే కలుగజేయును. సంపాదించిన ధనమును రక్షణ చేయునప్పుడు కూడా కష్టమునే కలుగజేయును. ఇట్లు కష్టము మీద రక్షించిన ధనము వ్యయమగునప్పుడు కలుగు బాధ వర్ణించనలవి కానిది. ఈ విధముగా నిరంతరము దుఃఖదాయకమగు ధనమును సుఖదాయకముగ భావించుట భ్రమగాక మరియేమి అగును. అందువలననే **వేధా ద్వేధా భ్రమం చక్రే కాన్తాసు కనకేషుచ।-తాసు తేష్వపి అనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః॥** అని పెద్దలు చెప్పిరి. కాన సుఖకామి అగువాడు ముందుగ ధనమును త్యజించవలెను. జగద్గురు ఆదిశంకరాచార్యుల వారు కూడా

**"అర్థమనర్థం భావయనిత్యం-నాస్తి తతః సుఖలేశ స్సత్యమ్"** అనిరి.

ఇచట ఒక సందేహము కలుగును. మనపెద్దలు 'ధనమూలమిదం జగత్' 'ధనాత్ ధర్మం తతస్సుఖమ్', ఇత్యాదిగ ధనము యొక్క ప్రాధాన్యము తెలుపు వచనములను కూడా ఉపదేశించిరి. ధనము లేకపోయినచో జీవయాత్ర జరుగుట కూడ కష్టమగును. ధనము లేనివాడు భార్యాపుత్రాదులను ఎట్లు పోషించుకొనును. అతిథి అభ్యాగతులను ఆదరించుట, మొదలుగా కల ధర్మములను ఎట్లు చేయగలడు. ఇట్టి అతిప్రధానమైన ధనమును దుఃఖసాధనముగ చెప్పి వర్జించమనుచున్నారేమి? అని. ఈ విషయము నందే శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారు చక్కని సమన్వయము చేసిరి. ఎట్లనగా ఈ జన్మయందు గాని, పూర్వజన్మలయందు గాని, పుణ్యము చేసిన వారలకు మాత్రమే ధనము లభించును. ఈ విధముగ ధనమును పొందిన వారు గర్వమును పొందరాదు. ధనమును పొందిన పిమ్మట గర్వమును పొందకుండుట చాలా కష్టము. అట్లు గర్వమును పొందినవారలే ఆ ధనమును దుర్వినియోగము చేసి పైన చెప్పిన దుర్వ్యసనముల బారినపడి పతితులగుదురు. అట్లు గాక ప్రయత్నపూర్వకముగా గర్వమును నశింపజేసికొనిన, వినయాది సద్గుణములను పెంపొందించుకొనిన, వారి ధనము సకల పురుషార్థ సాధనమై ఇహలోక పరలోకములయందు సుఖములనొసంగును.

## -కామమీమాంస-

కామము అనుపదమునకు మూడు అర్థములు కలవు. 1) కోరిక (2) కోరబడు విషయములు (3) మన్మథుడు. ధర్మార్థకామ మోక్షములు అను పురుషార్థములలోని కామశబ్దమునకు మాత్రము కోరబడు విషయములు అనియే అర్థము. పురుషులచే కోరబడు విషయములు అను ఈ కామము సత్కామము, అసత్కామము అను రెండు విధములు. ధర్మసమ్మతమైనది సత్కామము. ధర్మవిరుద్ధమైనది అసత్కామము. ఉదాహరణమునకు ఋతుకాలమునందు భార్యాసంగమము ధర్మసమ్మతమైనది కావున అది సత్కామము. నిషిద్ధ కాలమునందు భార్యాసంగమము ధర్మ విరుద్ధమైనది గావున అది అసత్కామము. అట్లే పరదారగమనము మొదలగునవి అసత్కామములు అగును. అందు ధర్మసమ్మతమైన కామమును అనుభవించుటచే ఇహలోకమునందు కీర్తి, పరలోకమునందు స్వర్గము ప్రాప్తించును. ధర్మవిరుద్ధమైన కామమును అనుభవించినవారలకు ఇహలోకమునందు అపకీర్తి, పరలోకమునందు నరకము లభించును. ఇచట ఋతుకాలమునందు భార్యాసంగమము వేదబోధితము, శ్రేయస్సాధనము కాన ఇది ధర్మములో చేరును గాని కామము ఎట్లు అగును? అని సందేహము కలుగును. ఈ సందేహమునకు శ్రీ బెల్లంకొండ రామరాయకవిగారు ఇట్లు సమాధానము చెప్పిరి. ఇచ్చట రెండు భాగములు కలవు. వేదబోధితమై పరలోకము నందు శ్రేయస్సాధనము అగుటచే అది ధర్మము అగును. ఇహలోకమునందు సుఖకరము అగుటచే అది కామము అగును.

ఇట్లు ధర్మబద్ధమైన కామమును అనుభవించుట ద్వారా వైరాగ్యము కలిగి తదనంతరము మోక్షము కూడా కలుగును. కామము మోక్షమునకు ప్రతిబన్ధకము కదా! అని సందేహపడవలసిన పనిలేదు. ధర్మవిరుద్ధమైన కామమే మోక్షమునకు ప్రతిబంధకము, ధర్మసమ్మతమైన కామము మోక్షమునకు అనుకూలమే! ఈ విధముగా కామము యొక్క గొప్పతనము ఇందు వివరించబడినది. ఈ గ్రన్థమును చదివిన వారలకు శ్రీ హయగ్రీవ భగవానుని అనుగ్రహము కలిగి తదుపరి మోక్షము లభించును అని నా దృఢ విశ్వాసము.

ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి
20-3-2006

శ్రీః

# ధర్మప్రశంసా

**1.** **ధర్మార్థకామమోక్షాఖ్యానాం చతుర్ణాం పురుషార్థాణామధ్యే ధర్మ ఉత్తమః, పురుషార్థత్రయసాధనత్వాదత ఏవ తస్య ప్రాథమ్యేన నిర్దేశః, తత స్తస్య ప్రశంసా మయా క్రియతే పామరా అపి ఏనాం శ్రుత్వా ధర్మామాచరయ్యుయథా కృతార్థాః స్యురిత్యేతదర్థో మమాయ ముద్యమః॥**

ధర్మార్థ కామమోక్షములనియెడు నాల్గు పురుషార్థములందు శ్రేష్ఠమైనది ధర్మము. ఏలయన తక్కుంగల మూడు పురుషార్థములను సాధించుట కియ్యది ద్వారము. కావుననే శాస్త్రకారులు దీనిని మొదటిదానినిగా బేర్కొనిరి. ధర్మ మిట్టిదిగాన దీని స్వరూపమును నేను వర్ణించుచున్నాను ఈ వ్యాసమునుజూచి పామరులు సైతము ధర్మమునాచరించి కృతార్థులు కావలెనను నాశయముతో నేను దీనిని వ్రాయ గడంగితిని.

**2.** **ధర్మేణ పాపమపనుదతి। ధర్మాన్నప్రమదితవ్యమ్। స్వధర్మే నిధనం శ్రేయ ఇత్యాది శ్రుతి స్మృతిషు ధర్మశబ్దః పఠ్యతే। తస్య స్వరూపాదికం మయోచ్యతే తావత్।**

'ధర్మేణ పాపమపనుదతి' 'ధర్మాన్న ప్రమదితవ్యమ్' 'స్వధర్మే నిధనం శ్రేయః' మున్నగు శ్రుతిస్మృతి వాక్యములలో 'ధర్మ' శబ్దము కానబడుచున్నది. అట్టి ధర్మము యొక్క స్వరూపము లక్షణము మున్నగువానిని నేను తెల్పుచున్నాడను.

**3.** **ధర్మోనామ 'శ్లో॥ విద్వద్భిస్సేవితం సద్భిర్నిత్య మద్వేషరాగిభిః॥ హృదయే -నాభ్యనుజ్ఞాతో యో ధర్మ స్తం నిబోధ'తేతి మనువచనాత్ శిష్టాచారానుమిత శ్రుతి స్మృతి ప్రమాణక శ్రేయస్సాధన భూతో జ్యోతిష్టోమాదిః॥ చోదనాలక్షణార్థో ధర్మ ఇతి జైమిని వచనాచ్చ యజేతేత్యాది విధిబోధితో వేదప్రమాణకం శ్రేయస్సాధనం జ్యోతిష్టోమాది రేవ ధర్మః॥**

ధర్మమనగా:- రాగద్వేషముల బారద్రోలిన మహాత్ములు నిత్యము దేనిని సేవింతురో-

వారు దేని ననుమతింతురో అయ్యది ధర్మము' అనితెల్పు మనుస్మృతివాక్యమునుబట్టి మోక్షసాధనమైన జ్యోతిష్టోమము మున్నగు సత్కర్మలే ధర్మమని గుర్తింపవలెను. ఈ కర్మలు వేదములవల్లను, ధర్మశాస్త్రములవల్లను, సదాచారసంపన్నులైన మహాత్ములయాచరణమువల్లను గ్రహింపదగియున్నవి. మఱియు 'చోదనాలక్షణోఽర్థోధర్మః' అనియెడి జైమినిసూత్రము వలనను జ్యోతిష్టోమాది యాగములే ధర్మమని తెలియచున్నది. (చోదనాలక్షణః=వేదములో 'చేయవలెను' అనునర్థము వచ్చు ప్రత్యయము కలిగినట్టియు, అర్థః= శ్రేయస్సాధనమైనట్టియు కర్మ, ధర్మః= ధర్మమని గుర్తింపవలెను. అని పై దెల్పిన జైమినివాక్యమునకర్థము. అనగా 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అనియొక వేదవాక్యము కలదు. స్వర్గము నభిలషించువాడు జ్యోతిష్టోమయాగ మాచరింపవలె నని దీనియర్థము. ఈవాక్యమందు "యజేత" (యజ్+త) అనియొక శబ్దమున్నది. అందు"యజ్" అనునది (ప్రకృతి) ధాతువు, (దేవతలను పూజించుట అని దీని యర్థము. 'త' అనునది ప్రత్యయము వలెను" అని యర్థము వచ్చును. ఈవిధముగా వేదముచేత 'చేయవలెను' అని శాసింపబడిన కర్మ మే ధర్మము అని జైమినిసూత్రము తెల్పుచున్నది.)

**4. శ్యేనయాగాదేరపి శ్రుతిమూలకత్వాదుక్తం శ్రేయస్సాధనమితి।**

ఇచటనొక సూక్ష్మాంశము గుర్తింపవలసియున్నది. మన వేదముచేత శాసింపబడినవన్నియు ధర్మమని తలచరాదు. చూడుడు.-"శ్యే నే నా భి చ ర న్ య జే త" అని యొకమంత్రముకలదు. శత్రుసంహారమును కాంక్షించువాడు శ్యేనయాగ మొనర్పవలెనని దీనియర్థము. ఈయాగప్రభావము చేత శస్త్రాస్త్రములతో బనిలేకయే శత్రువు నిహతుడగును. ఇది ధర్మమగునా? యనిన ధర్మముకాదు. వేదము బోధించినను అనర్థము వాటిల్లని పనిమాత్రమే ధర్మము. ఈ విషయమును ధర్మలక్షణము లోని 'శ్రేయస్సాధన' పదము తెల్పుచున్నది.

**5. కేషాఞ్చిద్ధర్మాణాం ప్రత్యక్షశ్రుత్యనుపలమ్భాదుక్తం శిష్టాచారానుమితేతి-మఙ్గలాచరణాదయో హి ధర్మాః శిష్టాచారైరనుమీయన్తే శ్రుతిమూలకా ఇతి। శ్రేయస్సాధనతా హ్యేషాం నిత్యం వేదాత్ప్రమీయత ఇతి వచనాద్వేదైరేవ ధర్మస్య శ్రేయస్సాధనత్వమభిధీయతే।**

కొన్ని ధర్మములకు వేదప్రమాణము కనుపించదు అవి యెట్లు ధర్మములగును? అనిన వేదవేదాంగపారంగతులైన సదాచారపరులు ఆ ధర్మముల నాచరించు

చుండిరేని ఆయాచారము ధర్మశాస్త్రమును చూచి బయలుదేరిన దనియు, ఆ ధర్మశాస్త్రము వేదమునుండియే పుట్టియుండు ననియు నూహించి అట్టి ధర్మములు వేదమూలములని గుర్తింపవలెను. ఉదాహరణమునకు గ్రంథారంభప్రార్థనల జూతము. కవులు, పండితులు- గ్రంథములు రచించునపుడు తొలుత దేవతా ప్రార్థనము వ్రాతురు. ఇదియొక సంప్రదాయమై విలసిల్లినది. ఇట్లు చేయవలెనని ధర్మశాస్త్రమునగాని వేదమునగాని ప్రమాణవచనము లేదు. ఐన నిది ధర్మమా ? కాదా ?యని విమర్శింప ధర్మమే యని పెద్దలు నిశ్చయించిరి. ఏలయన ఈ సంప్రదాయమును వేదధర్మపరాయణులైన శిష్టు లాచరించు చుండిరి. తొలుదొల్త నీ సంప్రదాయమును ప్రారంభించినవారు దీనికి వేదమున శాస్త్రాధారము చూచుకొనియే ప్రారంభించియుందురు. ఆ ప్రమాణవచనములు కాలగర్భమున లీనమై నను వారి యాచారమును బట్టి యిది వేదచోదిత ధర్మమే యని నిర్ణయింప బడవలెను. ఇట్టి యాచారములు ధర్మములని తెలియదగియున్నవి. ఇవి మానవునకు శ్రేయోదాయకములని "శ్రేయస్సాధనతా హ్యేషాం నిత్యం వేదాత్ప్రమీయతే" అను ప్రమాణము వలన దెలియుచున్నది.

**6. 'ప్రత్యక్షేణానుమానేన యస్తూపాయో న బుధ్యతే ఏనం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేద'తేతి।**

ప్రత్యక్షముచేతగాని, ఊహచేతగాని ఏ యుపాయము మనకు దెలియదో- వేదము దానిని తెలియజేయును. కావుననే "విద్"-(తెలియు) అను క్రియాపదము నుండి జనించిన "వేదము" అను పదము సార్థకమగుచున్నది.

**7. వేదో హ్యతీన్ద్రియమర్థం బోధయతి। స్మృతయశ్చ వేదాభ్యనుజ్ఞాతా ఏవ ప్రమాణం భవన్తి। "యద్వై కిఞ్చన మనురవదత్తద్భేషజ" మిత్యాది శ్రుతిభ్యో మన్వాదిస్మృతీనాం ప్రామాణ్యమ్।**

వేదము ఇంద్రియముల కలవికాని విషయమును తెలియ జేయును. స్మృతి గ్రంథములు వేదసమ్మతిని బడసియే ప్రమాణ మగుచున్నవి. యద్వై కిఞ్చన మనురవదత్త ద్భేషజమ్ (మనువు పలికినవాక్కులు మానవులకు ఔషధమువంటివి) అను నిట్టి వేదవాక్యముల వలన మనుస్మృతి మున్నగు ధర్మశాస్త్రములు ప్రమాణముగా నంగీకరింపవలసియున్నవి.

**8. యత్ర శ్రుతిద్వైధం స్మృతిద్వైధఞ్చ ప్రాప్నోతి తత్ర శిష్టాచారః ప్రమాణమ్।**

**"శ్రుతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా మహామునీనాం మతయశ్చ భిన్నాః, ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గతస్స పన్థా" ఇతి వచనాత్।**

ఒకే విషయమున భిన్న మార్గముల నాదేశించు రెండు వేదవాక్యములు, అట్లే రెండు స్మృతివాక్యములు కనుపించును. అట్టియెడ పెద్దల యాచార మెట్లుండునో దానిని ప్రమాణముగా గ్రహింప వలెనని"స్మృతిశ్చ భిన్నా" అను శ్లోకము తెల్పుచున్నది. వేదము భిన్నమార్గముల సూచించుచున్నది. ధర్మ శాస్త్రములు ఒకదానికి విరుద్ధముగా మరియొకటి చెప్పుచున్నవి. మునీశ్వరుల యభిప్రాయముల కూడ నొకదానిని పోలి రెండవది కనుపించుటలేదు! ఇట్లుండ ధర్మమెద్దియో మనము గ్రహించుట దుర్ఘటము. కావున పెద్దలు దేని నాచరించిరో అయ్యదియే ధర్మమని యెఱుంగవలెను.

**9. తథాచ, సాక్షాత్పరమ్పరయా వా శ్రుతిమూలకః శిష్టాచారాధిగతః శ్రేయస్సాధనభూతో జ్యోతిష్టోమాదిర్ధర్మ ఇతి సిద్ధమ్।**

పై విమర్శనమును బట్టి తేలిన దెద్దియను "వేదమువలనగాని వేదసమ్మతస్మృతి వలనగాని యేర్పడిన శిష్టాచారమునుబట్టి మానవులకు శ్రేయస్సాధనములుగా గుర్తింపబడిన జ్యోతిష్టోమ యాగము మున్నగునవి ధర్మము". అని తేలినది.

**10. అయం చ ధర్మః కర్మరూప ఇతి కేచిత్। కర్మ జన్యాపూర్వరూప ఇతి పరే। సర్వథాపి యదాచరణాత్ శ్రేయో విన్దన్తి దేహినః అశ్రేయశ్చ వినాశయన్తి స ధర్మః॥**

ధర్మమనునది కర్మరూపముగ నుండునని కొందఱి యభిప్రాయము. కర్మల నాచరించుటవలన గలిగిన పుణ్యరూపముగా నుండునని మఱికొంద ఱందురు. ఎట్లనిననేమి, మానవులు దేనినాచరించుటవలన శ్రేయము బడయుదురో- దేనివలన పాపమును బారద్రోలుదురో అది "ధర్మము" అని సారాంశము.

**11. శ్రేయశ్చ ద్వివిధం-నిత్యమనిత్యఞ్చేతి। తత్ర నిత్యం శ్రేయో నిశ్శ్రేయసం మోక్షః। అనిత్యఞ్చ ద్వివిధమైహికం పారలౌకికఞ్చేతి। స్త్రీపుత్త్రపశువిత్త ప్రాప్త్యాదిలక్షణమైహికం శ్రేయః। రమ్భాసమ్భోగామృతపానాదిప్రాప్తిలక్షణం పారలౌకికం శ్రేయః॥**

నిత్యశ్రేయము-అనిత్యశ్రేయము అని శ్రేయస్సు రెండు విధములు. నిత్యశ్రేయమనగా మోక్షము. అనిత్య శ్రేయస్సు రెండు విధములు. 1) ఐహికము. 2) ఆముష్మికము. దారాపుత్రులు పాడిపంటలు ధనధాన్యములు లభించుట యైహికశ్రేయము. దేహావసానమున స్వర్గమునజేరి, యచట నమృత పానము జేయుచు రంభ మేనక ఊర్వశి మున్నగు దేవకాంతలతో విహరించుట ఆముష్మిక శ్రేయము.

**12. న చ"తద్విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనా" యితి శ్రుతేః జ్ఞానమేవ మోక్షసాధనం నతు ధర్మ ఇతి వాచ్యమ్। "అస్య సమ్యగనుష్ఠానాత్స్వర్గో మోక్షశ్చ జాయత" ఇతి వచనాత్। సకామేన కృతస్య ధర్మస్య స్వర్గాదిసాధనత్వేపి నిష్కామేన కృతస్య ధర్మస్య చిత్తశుద్ధిజ్ఞానప్రాప్తిద్వారా మోక్షసాధనత్వమస్త్యేవ। కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయ ఇత్యాది గీతావచనేభ్యః। తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేనేతి శ్రుతేశ్చ।**

"తద్విద్వాన్ అమృత ఇహ భవతి=" ఆత్మ స్వరూపమును గుర్తించినవాడు అమృతత్వము అనగా మోక్షము పొందును. "న అన్యః పన్థాః విద్యతే అయనాయ" "మోక్షమునకు ఆత్మజ్ఞానము తప్ప వేరొక సాధనము లేదు" అనియెడు వేదవాక్యమును బట్టి ఆత్మస్వరూపజ్ఞానమే మోక్షసాధనము కాని, ఐహికాముష్మిక సుఖసాధనమైన ధర్మము మోక్షసాధన మెట్లగును? అని సందియము కలుగవచ్చును. చూడుడు. -"అస్య సమ్యగనుష్ఠానాత్స్వర్గో మోక్షశ్చ" జాయతే అను ప్రమాణము, ధర్మమును బాగుగ నాచరించినచో స్వర్గము, మోక్షము, లభించునని తెల్పుచున్నది. అనగా స్వర్గమునకుగాని మోక్షమునకుగాని ధర్మమే మూలమని యర్థము. అది యెట్లనిన పుత్రసంపద కాని, స్వర్గ సౌఖ్యమును కాని వాంఛించి పుణ్యకార్యము లొనర్చినచో నవియే లభించును, ఏకోరికయు లేక పుణ్యకార్యములొనర్చినచో నంతఃకరణశుద్ధి కలిగి జ్ఞానముదయించును. అటుపై మోక్షము ప్రాప్తించును. "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" కర్మవలననే జనకాదులకు ముక్తికలిగెను అను గీతావచనము వలనను, "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన" బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు యజ్ఞదానాది కర్మలద్వారా ఆత్మ స్వరూపమును తెలిసికొన గోరుచున్నారు అను వేదవాక్యమువలనను పుణ్యకర్మలు మోక్ష హేతువులని తెలియుచున్నది.

**13. కిఞ్చ యమనియమాద్యష్టాఙ్గయోగానుష్ఠానలక్షణో హి ధర్మస్సాధయతి మోక్షం,తథా వేదాన్తశ్రవణాది లక్షణశ్చ। శ్రవణధ్యానాదికం హి-క్రియా। ధర్మశ్చ క్రియైవ। అత ఏవ ధర్మస్య సాధ్యత్వమ్। సాధ్యతే క్రియత ఇతి సాధ్యో హి ధర్మః। అపూర్వో ధర్మ ఇతి పక్షేతు సాధ్యతే ప్రాప్యత ఇతి సాధ్యో ధర్మః కర్మనిష్పాద్య ఇత్యర్థః। హింసాదిరూపా క్రియా తజ్జన్యం దుష్కృతం వాఽ ధర్మః।**

మఱియు-యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనెడి యష్టాంగయోగముల ననుష్ఠించుట యొక ధర్మము. దీనివలన మోక్షము ప్రాప్తించును. ఇట్లే వేదాంతశ్రవణము మరియొక ధర్మము. ఇదియు మోక్షసాధనమే. శ్రవణమననాదులు క్రియారూపములు. ధర్మము కూడా క్రియారూపమే. కావున ధర్మము సాధ్యమనబడును. సాధింపబడునది అనగా చేయబడునది ధర్మమని యెఱుంగవలెను. ఇది, ధర్మము కర్మరూపమని చెప్పెడివారి యభిప్రాయము. కర్మ వలన కలిగెడి యదృష్టము ధర్మమని చెప్పెడివారి మతమున సాధ్యతే=ప్రాప్యతే ఇతి సాధ్యః ధర్మః పొందబడునది ధర్మము అని వ్యుత్పత్తి చెప్పవలెను. అధర్మమనగా హించేయుట మున్నగు పాపకార్యము-లేదా అట్టిపాపకార్యమువలన నేర్పడు దురదృష్టము.

**14. ధర్మాధర్మౌ తు పాశావివ పశుం దృఢం నిబధ్నన్తి న కదాచిదప్యేనం ముఞ్చన్తి। అర్థా గృహే నివర్తన్తే శ్మశానే మిత్రబాన్ధవాః సుకృతం దుష్కృతఞ్చైవ గచ్ఛన్తమనుగచ్ఛతి, ఇతి వచనాత్। ఆత్మవిత్తు ధర్మాధర్మాద్వయం ముఞ్చతి, తద్విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతీతి శ్రుతేః । తస్మాదాత్మవిదా స్వర్గాదిసాధనం ధర్మః నరకాదిసాధనమధర్మశ్చేత్యుభయం త్యాజ్యమేవ।**

ధర్మము-అధర్మము ఇవి మృగముల బంధించు త్రాళ్ళవలె మానవుని బంధిచును. ఎన్నడును ఇతనిని వీడవు. జీవుడు దేహమును విడిచి లోకాంతరమేగునపుడు ధనధాన్యము లింటియందే విడిపోవును. బంధుమిత్రులు స్మశానము వఱకేగి మరలుదురు. పుణ్యము పాపము మాత్రము జీవునివెంట నడచును. ఆత్మ స్వరూపమును సాక్షాత్కారించుకొనిన మహనీయుడు పుణ్యపాపములను రెండిని విడచునని "తద్విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి"

అను శ్రుతివాక్యము తెల్పుచున్నది. త త్త్వవేత్త పుణ్యపాపములను విడిచి సంగ రహితుడై బ్రహ్మభావమును పొందునని దానియర్థము. కావున నాత్మవేత్త స్వర్గసాధన మగు ధర్మమును కాని నరక సాధనమగు పాపమును గాని చేయడని గ్రహింప వలెను.

**15. త్యజ ధర్మమధర్మఞ్చ ఉభే సత్యానృతే త్యజ ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజేతి వచనాత్।**

తత్త్వవేత్తనుగురించి శాస్త్రమేమి బోధించుచున్నదో చూడుడు:- ధర్మకార్యములను అధర్మకార్యములను వదలివేయుము నిత్యఫలములను అనిత్యఫలములను విడనాడుము! ఈ రెంటిని సమభావముతో విడచి ఏమనస్సుతో వాని తారతమ్యమును గ్రహించుచుంటివో దానినికూడా విడచివేయుము (అమనస్క స్థితి జెందవలెనని భావము.)

**16. న చ మోక్షసాధనస్య ధర్మస్య కథన్త్యాజ్యత్వమ్ముముక్షణేతి వాచ్యమ్। యో ముముక్షుస్స న ధర్మం మోక్షసాధనం త్యజతి, యస్తు ముక్తస్స త్యజతీతి। న చ జీవతః కథం ముక్తిరితి వాచ్యమ్। యో జీవతి యో వా మ్రియతే తస్య దేహస్య కదాపి న ముక్తిః కిన్తర్హి? జీవస్త్యైవ స చాజ్ఞానాద్దేహాదితాదాత్మ్యాధ్యాసం ప్రపద్యేత। ప్రాగ్బద్ధ ఇవాభూదిదానీం జ్ఞానేనాజ్ఞానస్య సకార్యస్య నాశాదద్వితీయ బ్రహ్మరూపేణ ముక్తోఽభూదితి సిద్ధాన్తాత్।సంసారాత్సంసరణాన్ముక్తిర్హి మోక్షః**

అయ్యో! ముక్తినికోరువాడు మోక్షసాధనమైన ధర్మమును పరిత్యజించుట తగునా? యని సందియము కలుగవచ్చును. పైశ్లోకము ముముక్షువునకు వర్తింపదు. మోక్షము పొందినవాడు ధర్మాధర్మముల విసర్జింపవలెనని యర్థము.

ప్రశ్న:- బ్రతికియున్న వానికి మోక్షమెట్లు?

ఉత్తరము:- మోక్షము బ్రతికియున్న దేహమునకా మరణించిన దేహమునకా యని యెచటనులేదు. అది జీవునకు సంబంధించినది. జీవు దజ్ఞానముచే దేహేంద్రియాదులే తానని భ్రమించి వానిద్వారా జరిగిన కర్మలకు బద్ధుడైనట్లు సంచరించును. దేహేన్ద్రియాదులకు దనకు నెట్టిసంబధము లేదని గ్రహించినపిదప వానితో జరిగిన ధర్మాధర్మములకు తాను బద్ధుడనుకానని. గుర్తించును. అపుడు దేహమున్నను మరణించినను అతడఖండాద్వితీయపరబ్రహ్మ రూపుడై నిత్యముక్తుడైయుండును. కావున ముక్తికిని దేహనాశమునకును నెట్టి

సంబంధము లేదు. సంసారము(జనన మరణప్రవాహము) నుండియు అందుకు కారణమైన యజ్ఞానమునుండియు విడివడుటయే మోక్షము.

**17.సంసారకారణం చాజ్ఞానమ్।తస్యాత్మజ్ఞానాన్నాశః। తన్నాశే సుఖదుఃఖానుభవ లక్షణస్య,సంసారస్య,ఛిన్నమూలస్య తరోరివ నాశస్సమ్భవతి। తస్మాద్దేవతిర్యగాది జన్మప్రదధర్మాధర్మరూపపాశబన్ధో నాస్తి తత్త్వవిదః। అస్య చాత్మజ్ఞానస్య సాధనం ధర్మ ఏవేత్యుక్తమితి సిద్ధం ధర్మస్య మోక్షసాధనత్వం నిష్కామమీశ్వర ప్రీత్యర్థమనుష్ఠితస్య। స ఏవ సకామమనుష్ఠితస్సన్ కామసాధనశ్చ భవతి।**

అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నశించును. సుఖదుఃఖానుభవరూపమగు సంసార మంతయు నజ్ఞానము మీదనే యాధారపడియుండును గాన నజ్ఞానము నశించిన యెడల సంసారవృక్షము వ్రేళ్ళు దెగినచెట్టువలె నశించును. కావున తత్త్వవేత్తకు పునర్జన్మ కారణమైన పుణ్యాపాప బంధము లేదు. ఇట్టి యాత్మజ్ఞానముదయించుటకు ధర్మమే కారణమని చెప్పితిమి గాన నీశ్వరప్రీతిగ నొనర్చు నిష్కామకర్మ రూపమగు ధర్మము మోక్షహేతువనియు అదియే సకామముగ జేయబడినచో నిష్టార్థదాయక మనియు సిద్ధించినది.

**18. కిఞ్చ విహితః కామోపి ధర్మ ఏవ, ఋతుకాలదారగమనస్య ధర్మత్వాత్। "ఋతౌ భార్యాముపేయా" దితి శ్రుతివిహితత్వేన హి తద్ధర్మః, చోదనాలక్షణోఽర్థో ధర్మ ఇత్యుక్తత్వాత్। న చ నాస్య శ్రేయస్సాధనత్వమితి వాచ్యమ్। పుత్రోత్పత్తి ద్వారా దృష్ట శ్రేయసః సుకృతజననద్వారాఽదృష్టశ్రేయసశ్చ హేతుత్వాత్। ఏవమర్థస్యాపి ధర్మ ఏవ హేతుః।**

కామ మన విషయసుఖవాంఛ. ఇది ధర్మమా యని సందియము కలుగవచ్చును. సామాన్యముగ నిది యధర్మమని తలచుచుందురు. కాని శాస్త్రముచే విధింపబడిన కామము ధర్మమే యగును. ఋతుకాలమున భార్యను రమించుట ధర్మమని శాస్త్రము నుడువుచున్నది."ఋతౌ భార్యాముపేయాత్' (ఋతుకాలమున భార్యను కూడవలెను) అని వేదము శాసించినందున వేదచోదనగల యీకర్మ ధర్మమని గుర్తించవలెను.

ప్రశ్న. – ధర్మము శ్రేయస్సాధనమై యుండవలెను. భార్యాసంగమము వలన నెట్టి శ్రేయము లభించును?

ఉ: – పుత్రోత్పత్తియనెడి ఐహిక శ్రేయము, పుత్రజననము వలన లభించు పుణ్యమనెడి

ఆముష్మిక శ్రేయమున్ను ఋతుకాలభార్యసంగమము వలన లభించును. కాన నియ్యది శ్రేయస్సాధనమైన ధర్మమగును. విధివిహితమైన కామము ధర్మమైనట్లే అర్థసాధనము అనగా ధనార్జనముగూడ విధివిహితమైనది ధర్మమేయగును.

**19. శ్రీసూక్తాద్యుక్తవిధినా లక్ష్మ్యాద్యర్చనరూపస్య ధర్మస్యార్థహేతుత్వాత్। పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాస్సమ్పదో విపద ఏవ విమృష్టా ఇతి జన్మాన్తరానుష్ఠిత ధర్మస్యేహ జన్మన్యర్థహేతుత్వాత్।**

శాస్త్రము చెప్పినటుల శ్రీసూక్తపారాయణము లక్ష్మీపూజ మున్నగువాని ననుష్ఠించిన ధనము లభించును. పుణ్యాచరణము ధనప్రాప్తికి కారణమని యీక్రింది శ్లోకము తెల్పుచున్నది. -

"పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః-సంపదో విపద ఏవ విమృష్టాః"

పూర్వజన్మమునందొనర్చిన పుణ్యములు ఈజన్మమునందు ధనధాన్యాదిరూపముగా పరిణమించి నశించుచుండును. కావున జక్కగా ఏమర్జించిన నీసంపదలు ఆపదలే యనవచ్చునని పై శ్లోకమునందలి భావము. దీనివలన ధర్మాచరణమే ధనమునకు మూలమని తేలినది.

**20. అధార్మికధనస్య క్షణభఙ్గురత్వాచ్చ- న చ ధర్మాచరణేన ధనికస్య ధనం క్షీయత ఇతి వాచ్యం, క్షయాదప్యధికమదృష్టం సద్వర్ధత ఏవ-అతఏవ జన్మాన్తరే ధార్మికస్య ప్రభూతధనలాభః, సర్వమపి ధనధాన్యాదికం కర్మసు వినియోజ్య మఖశతం కృతవాన్ని పురుషః ప్రాప్నోతీన్ద్రత్వమ్। తస్మాద్విహితయా వృత్త్యా సమార్జితస్య ధనస్య దేశే కాలే పాత్రే చ నిక్షేపరూపో యః ధర్మః, సః నిక్షిప్తాదధికమేవ ధనం నిక్షేప్తుర్జన్మాన్తరే ప్రదత్త ఇత్యర్థహేతురేవ ధర్మః। కిమ్బహునా సర్వాపి లోకయాత్రా ధర్మమూలైవ।**

ప్రశ్న:- అధర్మము చేయువారికి ధనము సమకూడదా?

ఉ:- కావలసినంత సమకూడును. కాని అది క్షణభంగురమైనది.

ప్రశ్న:- ధర్మముచేత సంపాదించినసొమ్ము వ్యయమొనర్చినను తరుగకుండునా?

ఉ:- క్షీణించుగాక! అయినను అది గూఢముగా వృద్ధియగుచుండును. మఱియు నుత్తరజన్మమున గొప్పసంపన్నునిగా పుట్టించును. ఎట్లన-

ఒక కోటీశ్వరుడు తనకున్న ధనమంతయు వ్యయము చేసి నూరు యజ్ఞముల నాచరించు ననుకొనుము. అంతటితో నతడు ధనరహితుడై మరణించెను. ఐననేమి? ఆయజ్ఞముల ప్రభావమున నాతనికి నింద్రపదవి లభించును. ఇక నైశ్వర్యమునకు కొఱతయేమి? కావున శాస్త్రవిహితమైన వృత్తితో నార్జించిన ధనము పవిత్ర దేశకాల పాత్రములందు వ్యయమొనర్చినయెడల పెక్కు రెట్లుగానది వృద్ధిజెంది జన్మాంతరమం దుపకరించును. కావున అర్థమునకు ధర్మమే హేతువైనట్లు గ్రహించితిమి.

**21. తథా హి ప్రజానాం యజనం ధర్మః, దేవానాఞ్చ స్త్రీపశ్వన్నాదిదానం ధర్మః। తథా చ గీతా- సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ...దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః, పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ఇతి।**

*వివిధ ధర్మములు:*- మానవులకు యజ్ఞములాచరించుట ధర్మము. వీరు కోరినటుల దారాపుత్రులను పశువులను ధనధాన్యములను నొసగుట దేవతల ధర్మము. ఇదియే భగవద్గీతలో చెప్పబడినది. -

*(శ్లో॥ సహయజ్ఞాః...)పూర్వము బ్రహ్మదేవుడు మానవులను సృజించుచు వారితోబాటు యజ్ఞకర్మనుగూడ సృజించి యిట్లు బోధించెను. ప్రజలారా! యీయజ్ఞము ననుష్ఠించి మీరు మీయభీష్టముల సాధించుకొనుడు! మఱియు- "దేవాన్భావయత" మానవులారా! మీరు యజ్ఞయాగముల ననుష్ఠించి దేవతలను తృప్తిపరచుడు! వారు మీకు సకాలమున వర్షముల గురిపించుచు ధనధాన్యముల నందజేయుదురు - అని గీత చెప్పెను.*

**22. కిఞ్చ అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్యముపతిష్ఠతే। ఆదిత్యాజ్జాయతే వృష్టిర్వృష్టేరన్నం తతః ప్రాజా ఇతి స్మృతేశ్చ యజ్ఞప్రజయోరన్యోన్యం కార్యకారణభావో బీజాఙ్కురయోరివ। తస్మాద్యజ్ఞస్యాభావే న జగచ్చక్రనిర్వాహ స్సమ్భవతి।**

మఱియు, "అగ్నౌప్రాస్తాహుతిః" మనమగ్ని యందు హోమమొనర్చిన ద్రవ్యము సూక్ష్మరూపమున సూర్యభగవానుని జేరును- సూర్యుడు మేఘముల సృజించును. అవి వర్షింపగా పైర్లు పండి ప్రాణులు పుట్టుదురు అని మనుధర్మ శాస్త్రము చెప్పినట్లు ప్రజలకు యజ్ఞమునకు చెట్టుకు విత్తుకునున్నట్లు నిత్యసంబంధమున్నది. కావున యజ్ఞము జరుగని యెడల ప్రపంచచక్రము తిరుగజాలదు.

**23. తథా రాజ్ఞః ప్రజాపాలనం ధర్మః ప్రజానాం చ రాజ్ఞే కరదానం ధర్మః ఉభయస్యోభయాతిక్రమే న రాజ్యసిద్ధిః। అరాజకో హి దేశః క్షిప్రమేవ విప్లవేత। ఏవమ్ రాజ్ఞోమన్త్రిసేనాపత్యాదిభ్యోభృతిదానం ధర్మః తేషాం చ రాజపురుషాణాం రాజకార్యనిర్వహణం ధర్మః ఉభయస్యోభయాతిక్రమే న రాజ్యసిద్ధిః॥**

**ప్రపంచ ధర్మములు:-** ప్రజలను పోషించుట రాజునకు ధర్మము. ఆతనికి కప్పము చెల్లించుట ప్రజల ధర్మము. ప్రజలు- రాజు తమ ధర్మముల విడనాడిన రాజ్యచక్రము నడువదు. అరాజకస్థితి యేర్పడి దేశమున విప్లవము చెలరేగును. ఇట్లే- మంత్రులు సేనానాయకులు మున్నగు నుద్యోగులకు బత్తెమిచ్చుట రాజధర్మము. రాచకార్యముల నెరవేర్చుట ఉద్యోగుల పని. వీరిర్వురు తమవిధిని నెరవేర్పనియెడల రాజ్యచక్రము స్తంభించును.

**24. తథా భర్తుర్ధనసమ్పాదనేన భార్యాభరణం ధర్మః। భార్యాయాశ్చాన్నకరణాదినా భర్తృశుశ్రూషణం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న సంసారసిద్ధిః ఏవం పితుః పుత్త్రస్య విద్యాప్రదానం ధర్మః। పుత్త్రస్య చ పితుస్సంరక్షణం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న సంసారసిద్ధిః॥**

ధనమార్జించి భార్యను పోషించుట పతిధర్మము, వంటచేసి పతిశుశ్రూషచేయుట పత్నీధర్మము. వీరు తమ ధర్మముల నతిక్రమించిన యెడల సంసారము నడువదు. పుత్రునకు విద్యనేర్పించుట తండ్రికి ధర్మము. తండ్రిని సంరక్షించుట పుత్రుని ధర్మము. ఉభయులు తప్పిన కుటుంబము జరగదు.

**25. తథా విదుషోఽవిదుషే విద్యాప్రదానం ధర్మః అవిదుషశ్చ విదుషే దక్షిణాదానం ధర్మః, ఉభయస్యోభయాతిక్రమే న విద్యాసమ్ప్రదాయసిద్ధిః। ఏవం ధనికస్య దరిద్రజనాయ ధనాన్నాదిదానం ధర్మః, దరిద్రజనస్య చ చోరాద్యుపద్రవేభ్యో ధనికసంరక్షణం ధర్మః, ఉభయస్యోభయాతిక్రమే న జీవనసిద్ధిః। తథా యజమానస్య పురోహితాయ ధనాదిదానం ధర్మః, పురోహితస్య చ యజమానహితోపదేశాదికం ధర్మః, ఉభయస్యోభయాతిక్రమే న వర్ణాశ్రమ ధర్మసిద్ధిః॥**

చదువురానివానికి విద్యాదానము చేయుట విద్వాంసునకు ధర్మము. విద్వాంసుని, ధనముతో సత్కరించుట విద్యార్థి ధర్మము. వీరుభయులు తమ విధి నుల్లంఘించిన

గురుశిష్య సంప్రదాయము నశించును. దరిద్రులకు అన్నము ధనము అందజేయుట ధనికుల ధర్మము. ధనికులను దొంగలనుండి దుష్టుల నుండియు కాపాడుట దరిద్రుల ధర్మము. వీరు తమ కృత్యము నిర్వహింపనిచో జీవయాత్ర జరుగదు. పురోహితులకు ధనధాన్యము లొసంగుట గృహస్థుల ధర్మము. గృహస్థులకు హితోపదేశ మొసంగుచు వారిని ధర్మ మార్గమున నడిపించుట పురోహితుల ధర్మము. వీరు తమ ధర్మమును వీడిన వర్ణాశ్రమధర్మములు నశించును.

**26. ఏవం స్వర్ణకారకులాలాదీనాం కుణ్డలఘటాదికరణం ధర్మః, ద్విజానాం చ కుణ్డలఘటాదిస్వీకారేణ రథకారకులాలాదీనాం ధనధాన్యాదిదానం ధర్మః , ఉభయస్యోభయాతిక్రమే నోపకరణసిద్ధిః।**

కంసాలి-కుమ్మరి మున్నగు కులస్థులు సొమ్ములు పాత్రలు తయారుచేసి ప్రజలకందిచ్చుట వారి ధర్మము. అయా వస్తువులగైకొని ధనధాన్యములనొసంగుట తక్కినవారి ధర్మము. వీరుభయలు తప్పినయెడల జీవయాత్రకు కావలసిన పదార్థములు లభింపవు.

**27. ఏవం మతాచార్యస్య మతోపదేశాదికం ధర్మః। మతస్థానాన్తు మతాచార్యాయ ధనదానం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న మతసిద్ధిః। తథా కృషీవలస్య కర్షణాదిర్ధర్మః భువశ్చ సస్యప్రసవో ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే నౌదనసిద్ధిః**

ప్రజలకు మతధర్మముల బోధించుట పీఠాధిపతుల ధర్మము. వారిని ధనకనకవస్తు వాహనములతో సత్కరించుట ప్రజల ధర్మము. వీరిర్వురు తమవిధుల నెరవేర్పనిచో మతాచారము లడుగంటును. సేద్యముచేయుట రైతుధర్మము, పైర్లుమొలిపించుట పొలమునకు ధర్మము. ఇది జరుగనిచో ప్రజలకన్నము లభింపదు.

**28. తథా వణిజః పదార్థవిక్రయో ధర్మః, ప్రజాయాశ్చ విత్తేన తత్క్రయణం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న పదార్థసిద్ధిః। ఏవం భిషజః రోగహరౌషధ దానం ధర్మః, రోగిణశ్చ భిషజే ధనదానమ్। ఉభయస్యోభయాతిక్రమే న జీవనసిద్ధిః, తథా చ నటానాం గాయకానాఞ్చ నాట్యేన గానేన సహృదయా-నన్దనం ధర్మః, సహృదయానాఞ్చ నటేభ్యో గాయకేభ్యశ్చ పారితోషికదానం ధర్మః, ఉభయస్యోభయాతిక్రమే నాట్యగాన యోరేవాసిద్ధిః।**

పదార్థముల విక్రయించుట వైశ్యుల ధర్మము. వానిని ధనముతో గొనుట ప్రజల

ధర్మము. లేనియెడల పదార్థములు దొరుకవు. రోగులను పరీక్షించి తగినఔషధ మొసంగుట వైద్యుల పని, వారికి ధనమిచ్చుట రోగులకు కర్తవ్యము. దీనిని తప్పిన జీవయాత్ర కొనసాగదు. నటకులు గాయకులు తమనాట్యగానములచే సహృదయు లను. మెప్పించుట వారి ధర్మము. వారిని పోషించుట సహృదయుల ధర్మము. ఇది జరుగనిచో నీ కళలు నశించును.

**29.** **ఏవం భృతకస్యయజమానోక్త కర్మాచరణం ధర్మః, యజమానస్య చ భృతకాయ భృతిదానం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న కార్యసిద్ధిః, తథా గోమహిష్యాదీనాం తృణజలదానం పశుమతో ధర్మః, పశుమతే పయః కరీషాదిదానం గోమహిష్యాదిధర్మః, ఉభయస్యోభయాతిక్రమే న పయ ఆదిసిద్ధిః**

యజమానిచెప్పిన పనిచేయుట సేవకుని ధర్మము సేవకునకు బత్తెమిచ్చుట యజమాని ధర్మము. ఈరెండును నెరవేరనిచో కార్యములు జరుగవు. గోవులకు గేదెలకు నీరు మేతనిచ్చుట గృహస్థుల కార్యము. వీరికి పాలను ఎరువును ఇచ్చుట పశువులపని. ఇటుల జరుగని యెడల పాడిపంటలు స్తంభించును.

**30.** **ఏవం వృక్షేభ్య ఉదకాదిదానం వృక్షవతో ధర్మః, వృక్షవతే ఫలపుష్పాది దానం వృక్షాణాం ధర్మః। ఉభయస్యోభయాతిక్రమే న ఫలాదిసిద్ధిః। కిమ్బహునా సర్వమపి జగదేవమన్యోన్యముపకారకం సత్స్వధర్మమనతిక్రమ్య వర్తతే, తస్మాద్ధర్మమూలమేవేదం జగత్।**

నీరు ఎరువునిచ్చి వృక్షముల పోషించుట యజమానుల విధి. ఫల పుష్పములనిచ్చుట వృక్షముల పని. ఇవి జరుగనిచో ఫలపుష్పములు దొరుకవు. వేయేల? ప్రపంచ మంతయు పరస్పర సహకారమును పొందుచు తన ధర్మమును నిర్వహించుచున్నది. కావున జగత్తు ధర్మమూలమైయున్నది.

**31.** **యద్యపి మహాభూతాని కేచిన్మహాన్తశ్చ ప్రత్యుపకారమనపేక్ష్యైవ లోకస్యోపకుర్వన్తి-తథాపి ప్రత్యుపకారానపేక్షోపి స ఉపకారః ధర్మ ఏవేతి న జగతో ధర్మమూలత్వస్యకాపి క్షతిః, ఏవమీశ్వరస్యాపి యద్భక్తరక్షణం దుష్టశిక్షణం చ తత్తస్య ధర్మ ఏవ, ఏవం ధర్మాధర్మద్వయమతిక్రాన్తస్యైవేశ్వరస్య ధర్మాశ్రయత్వే కిమ్పునర్జీవానాం ధర్మాధర్మ పాశబద్ధానాం ధార్మికత్వం వక్తవ్యమ్।**

ప్ర: పరస్పరోపకారము పొందినగాని ధర్మము సిద్ధింపదా? మహాత్ములు, మహాభూతములు నన్యులవలన నుపకారమపేక్షింపరే! అచట ధర్మమెటుల

సిద్ధించును?

*ఉ:- నిష్కామముగ నితరులకుపకరించుటే వారిధర్మము కావున జగత్తు ధర్మమూల మనుటలో సందియము లేదు.*

*ప్ర:- జగత్తు ధర్మమూలముమగుగాక! ఈశ్వరునకు ధర్మముతో నెట్టి సంబంధము?*

*ఉ:- అతడును ధర్మము నాశ్రయించియే యుండును. భక్తులను రక్షించుట,దుష్టులను సంహరించుటయు నాతని ధర్మము. పుణ్యపాపములకతీతుడైన యీశ్వరుడు సైతము ధర్మము నాశ్రయించియుండ పుణ్యపాపములనెడి పాశములకు లోనై యుండు జీవుని విషయమడుగవలెనా? అతడును ధర్మము నాశ్రయించియే యుండును. ఇట్లు జగత్తు-ఈశ్వరుడు-జీవుడు ధర్మముపై నాధారపడి యున్నటుల దెలిసి కొంటిమి.*

**32. నను ధర్మమూలమేవ జగదితి వక్తుం న శక్యతే। కిన్త్వధర్మమూలమపీతి। తథా హి। స్వామిద్రవ్యాపహారిణః కేచిత్। సాధుద్రవ్యాపహారిణః కతిచిత్। పరదారాపహారిణః పరే। స్వదారపరిహారిణోఽపరే, స్త్రీబాలప్రాణాపహారిణోఽన్యే, గర్భఘ్నాః కాశ్చిత్, పతిఘ్నాః కతిచిత్, పరపురుషగామిన్యః పరాః, ఇత్యాదిదర్శనాదితి చేత్।**

*ప్ర:- ఓయీ! జగత్తు అంతయు ధర్మముపైననే ఆధారపడియున్నదని చెప్పుటకు వీలులేదు. కొంతభాగము అధర్మము మీదను ఆధారపడియున్నది. ఎట్లందువా? వినుము.*

***అధర్మవర్తనులు:-*** *కొందఱు సేవకులు తనయజమాని విత్తము నపహరించి మేడలు కట్టుకొని సుఖముగ జీవింతురు. కొందఱు సజ్జనుల ద్రవ్యమును హరించి జీవయాత్ర గడపుదురు. పరకాంతలను పరిగ్రహించి కొందఱు బ్రతుకుచుందురు. అగ్నిసాక్షిగాగొన్న భార్యలను కొందఱు విడనాడుచుందురు. స్త్రీలను శిశువులను స్వలాభమునకై కొందఱు వధించుచుందురు. కొందఱు జారిణులు గర్భస్రావముల జేసికొనుచుందురు. మఱికొందఱు యువతులు పరపురుషులతో రమించుచుందురు. వీరందఱు జీవించుటలేదా? సుఖించుట లేదా? కావున ప్రపంచస్థితికి అధర్మము కూడా కొంతవఱ కాధారమని యేల చెప్పరాదు?*

**33. మైవమ్,యద్యపి చోరస్య చౌర్యమధర్మ స్తథాపి తస్య చౌర్యార్జితేన ధనేన స్వజనరక్షణం ధర్మః, ఏవం స్త్రియాః వ్యభిచారో యద్యప్యధర్మః తథాపి తస్యా**

వ్యభిచారార్జితేన ధనేన స్వజనరక్షణం ధర్మః, యద్యపి నృశంసస్య స్త్రీబాలాది ప్రాణాపహరణమధర్మః తథాపి తస్య స్త్రీబాలహననార్జితధనేన స్వజనరక్షణం ధర్మః, యద్యపి పరదారాపహరణమధర్మః తథాపి స్వాపహృతపరదారభరణం తస్య ధర్మః।

**అధర్మములో-ధర్మము:-** ఉ. - ఓయీ! నీవుచూపిన యధర్మవృత్తులలో పరిశీలించిన యెడల కొంచెము ధర్మముకూడా నిమిడియున్నది. ఏమందువా? వినుము.

దొంగతనము చేయుట సహజముగా నధర్మమే. కాని, ఆధనముతో నతడు తన కుటుంబమును పోషించునేని యాతడు కొంతధర్మమును పాలించినవాడగును. (ఎట్లందువా?"అప్యకార్య శతం కృత్వా భర్తవ్యా మనురబ్రవీత్" ఎన్ని యకార్యములు చేసియైనను తలిదండ్రులను దారాపుత్రులను పోషింపవలెనని ధర్మశాస్త్రము తెల్పుచున్నది. ఇట్టి ధర్మమునతడు పాటించినవాడగును) పరపురుషునితో సంచరించుట స్త్రీలకధర్మమే. కాని, అటుల సంపాదించిన ధనముతో దనవారిని పోషించుట వారి యందుండు స్వల్పధర్మము. సొమ్మునకై స్త్రీలను శిశువులను వధించుట అధర్మమే. కాని ఆధనముతో తనవారిని పోషించుట ధర్మము. అన్యకాంతల నపహరించుట అధర్మమే. కాని, తానపహరించిన స్త్రీని పోషించుట వాని ధర్మము.

**34.** యద్యపి స్వదారపరిహరణమధర్మః తథాపి తస్య జీవన్త్యై తస్యై భరణ దానమ్। మృతాయై పిణ్డదానం చ ధర్మః యద్యపి విధవాయా గర్భహననమధర్మః । తథాపి విద్యార్థి కాముకజనకామపూరణం ధర్మః। యద్యపి వేశ్యాయా గర్భహననమధర్మః తథాపి తస్యా అప్రజాయా అభ్రష్టయౌవనత్వేన సురతక్షమాయాః సురతార్జితేన ధనేన స్వజనరక్షణం ధర్మః, యద్యపి స్వైరిణ్యాః పతిహననమధర్మః, తథాపి తస్యాః పరపురుషశతకామపూరణం ధర్మః।

భార్యను పరిత్యజించుట అధర్మము. కాని ఆమె జీవించువఱకు భరణమిచ్చుట- మరణించిన కర్మజేయుట వానికి ధర్మము. ఇట్లే వితంతువులు వేశ్యలు జారిణులు గావించు నధర్మములందు సైతము విమర్శించిన, ధర్మభాగము కొంచెము దాగియుండును.

**35.** కిఞ్చ చోరా అపి కేచిద్వాపీకూపాది ధర్మకార్యాణి కుర్వన్తి। తథా జారిణ్యోపి

**కాశ్చిత్। తస్మాద్యస్మిన్ కస్మిన్నప్యధార్మికే జనే యః కోపి ధర్మో వర్తత ఏవ। తేనైవ స జీవతీతి ధర్మమూలమేవేదం జగత్।**

ఇంతయేకాదు. పై దెల్పిన యధర్మవర్తనులు ప్రత్యేకముగ ధర్మకార్యముల జేయుటకూడ గలదు.

**అధార్మికుల ధర్మములు:-** కొందఱు దొంగలు శ్రమపడి ధనము నిలువజేసి మార్గములందు బావులను త్రవ్వించుట, చలిపందిరుల నెలకొల్పుట మున్నగు ధర్మకార్యముల జేయుచుందురు. ఇట్లే జారస్త్రీలును ధర్మకార్యముల జేయుట కలదు.

ఓయీ! అధార్మికుడుగా కనబడువానియందు సయితము మెద్దియో యొక ధర్మముండు ననియు దానిచే నతడు జీవించుననియు గ్రహింపవలసియున్నది. కావున ప్రపంచమంతయు ధర్మము పైననే ఆధారపడి యున్నది. కావున ప్రపంచమంతయు ధర్మము పైననే ఆధారపడి యున్నదనుట కాక్షేపణము లేదు.

**36. నను శత్రుగృహాదిష్వగ్నిదానమధర్మ ఏవ। న తు తత్సాధ్యః కోపి ధర్మోస్తీతి చేదుచ్యతే। దగ్ధగృహాదిధూమస్య మేఘీభూయవర్షణమేకో ధర్మః। అగ్నౌ హవిః ప్రక్షేపణమన్యశ్చ ధర్మ ఇతి।**

*ప్ర:-* ఓయీ కొన్ని యధర్మములలో ధర్మము గోచరించుగాక! కొందరు దురాత్ములు తమ విరోధిగృహములను తగుల బెట్టుచుందురు. దానిలో నేమైన ధర్మముకలదా?

*ఉ:-* లేకేమి? తగులబడిన గృహమునుండి యెగసిన పొగ మేఘమై వర్షించును. ఇది యొక ధర్మము. అగ్నిహోత్రమున కాహుతి లభించుట రెండవ ధర్మము.

**37. నను శత్రుప్రాణాపహరణమధర్మ ఇతి చేన్నైవమపి। ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయో న్యత్క్షత్రియస్య న విద్యతే ఇతి గీతావచనాద్యుద్ధం ధర్మ ఏవ।**

*ప్ర:-* శత్రువుల ప్రాణముల దీయుట అధర్మము కాదా?

*ఉ:-*కాదు. యుద్ధము ధర్మకార్యమే. ధర్మసమ్మతమైన యుద్ధమునకంటె మరియొక శ్రేయోమార్గము లేదని గీతవచించెను.

**38. నను క్షత్రియేతరస్య తదధర్మ ఇతి చేదుచ్యతే। ఆతతాయినమాయాన్తం హన్యాదేవావిచారయన్నితి శాస్త్రాద్ధర్మ ఏవ। అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనా-పహః, క్షేత్రదారహరశ్చైవ షడేతే ఆతతాయిన ఇత్యాద్యాతతాయిలక్షణమ్।**

ప్ర:- అది ఒక క్షత్రియవిషయమేకద! తదితరులకు శత్రువధ యధర్మముకాదా?

ఉ:-ఆతతాయిని ప్రతివారును చంపవచ్చునని ధర్మ శాస్త్రము తెల్పుచున్నది.

ప్ర:- ఆతతాయులన నెవరు?

ఉ:- ఆరువిధములగు పాపకార్యముల జేయువారిని ఆతతాయులని శాస్త్రము పేర్కొనెను. ఎవ్వరన- (1) ఇండ్లకు నిప్పు పెట్టువాడు. (2) అన్నములో విషము పెట్టి చంపువాడు. (3) ఒకరిని వధించుటకై ఆయుధము చేబూనినవాడు. (4) పర ద్రవ్యముల నపహరించువాడు (5) ఇతరుల భూముల నాక్రమించువాడు. (6) పరభార్య నపహరించువాడు.

**39. నను పశువిశసనమధర్మ ఏవేతి చేన్మైవమ్। ద్విజానాన్తీర్థేషు పశువిశసనం ధర్మ ఏవ, అద్విజానాన్తు స్వాభావికస్తద్ధర్మ ఏవ, 'న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే పవృత్తి రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫ'లేతి మనువచనాత్। మాంసభక్షణం హి పశువిశసన లభ్యమ్।**

ప్ర:- పోనిందు! పశువులను వధించుట అధర్మము కాదా?

ఉ:- ద్విజులు యజ్ఞమునకై పశువుల వధించుట ధర్మము. శూద్రులు సహజముగా బశువుల వధించుచుందురు. అదియు నధర్మము కాదు.

ప్ర:- అయ్యో మాంసభక్షణము ధర్మమగునా?

ఉ:- ఒక్క మాంసభక్షణమే కాదు. మద్యపానము-మైథునము కూడ ధర్మములే యగును.

ప్ర:- ఆర్యా! తమ ధర్మబోధ విపరీతముగ నున్నది.

ఉ:- ఓయీ! త్వరజెందక శాంతిచిత్తముతో వినుము. మాంసభక్షణము-మద్యపానము-మైథునము ఇవి ప్రజలకు సహజముగా పట్టుబడును. కావున వానిలో నధర్మము లేదు. కాని, సహజముగ సంక్రమించిన యీదుర్వ్యసనముల నణు మాత్రమైన తగ్గించినచో నందు మహత్తర ఫలము కలదని మనుధర్మశాస్త్రము వచించెను.

**40. నను నిద్రాదినా ప్రమత్తస్య శత్రోర్హననమధర్మ ఏవేతి చేన్మైవమపి। న హి కోపి నిష్ప్రయోజనం శత్రుం హన్తి! కిన్తర్హి? యత్కిఞ్చిత్ప్రయోజనమభిసన్ధాయైవ, తచ్చ ప్రయోజనం స్వార్థసంరక్షణమ్ శత్ర్వర్థాగమనం వా భవితుమర్హతి, తేన**

**చార్థేన స్వజనరక్షణాదికం ధర్మ ఏవేతి।**

ప్ర:- మంచిది, నిద్రించుచుండగ శత్రువును వధించుట అధర్మముకాదా?

ఉ:- అందును కొంచెము ధర్మమిమిడియున్నది. వినుము. ఎవ్వడును నిష్కారణముగ నొకని జంపడు. తనయర్థమును రక్షించుకొనుటకో లేక ఇతరుని ధనము తీసికోనుటకో ఆ పని జేయును. ఆధనముతో దన కుటుంబమును పోషించు కొనును. కుటుంబపోషణమను ధర్మము ఆ యధర్మమున నున్నది.

**41. నను స్వజనరక్షణం నైవ ధర్మ ఇతి చేన్మైవమ్। వృద్ధౌ చ మాతాపితరౌ సాధ్వీ భార్యా సుత శ్శిశుః, అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మనుర బ్రవీదితి వచనాత్। ఏవం దుర్జనేష్వేవ ధర్మసత్త్వే కిమ్మునస్సజ్జనేషు!**

ప్ర:- కుటుంబ పోషణము కూడా నొక ధర్మమే యగునా?

ఉ:- ధర్మమేయని మనుబ్రహ్మ పలికెను. వృద్ధులైన తల్లిదండ్రులు, సద్వర్తనముగల భార్య రెక్కలురాని పుత్రుడు వీరిని నూరు దుర్మార్గముల జేసియైనను పోషింపవలెనని 'వృద్ధౌ చ మాతా పితరౌ" అను వాక్యము తెల్పుచున్నది. ఇవ్విధముగ దుర్జనులయందే ఎద్దియే నొకరూపమున ధర్మమిమిడియుండ సజ్జనుల విషయమడగవలెనా?

**42. స చ ధర్మో ద్వివిధః। స్వీయః పారక్యశ్చేతి, తత్ర స్వీయః స్వర్గాదిప్రాప్తి హేతుః। పారక్యస్తు నరకపాతాదిభయహేతుః। స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహ ఇతి గీతావచనాత్। అతఏవ పరధర్మః స్వస్యాధర్మ ఏవ।**

**స్వధర్మము-పరధర్మము:**- ధర్మము రెండు విధములు. 1. స్వధర్మము, 2 పరధర్మము. అందు స్వధర్మము స్వర్గాదిలోకమునకు మోక్షమునకును గారణము. పరధర్మము నరకప్రాప్తికి, నీచజన్మములకును గారణము. 'స్వధర్మము నాశ్రయించి అందు మరణించినను శ్రేయమే కాని పరధర్మము నాశ్రయింపరాదు. అది పతన హేతువు' అని భగవద్గీత తెల్పుచున్నది.

ప్ర:- పరధర్మముకూడా ధర్మమేకదా! అది పతన హేతువగుటెట్లు?

ఉ:- పరధర్మము పరునకు ధర్మము కాని తన కధర్మమే యగును. ఇంకను వినుము.

**43. ఏవఞ్చ ధర్మ ఏవ పురుషభేదేనాధర్మో భవతి। అధర్మశ్చ పురుషభేదేన ధర్మో భవతి। తథా క్వచిత్కాలాది భేదేనాపి ధర్మాధర్మయోర్వినిమయో భవతి।**

**యథా నిరాపత్కస్య ద్విజస్య ద్విజేతరాన్నోదకగిళనమధర్మః। తస్యైవ ప్రాణాపదం ప్రతిపన్నస్య తద్ధర్మ ఏవ। ప్రసిద్ధోయమర్థ ఉపనిషదాదిషు। విధవాయాం పుత్రార్థే దేవరస్య నియోజనం యుగాన్తరే ధర్మ ఇదానీమ్పునరధర్మః। ఇత్యాద్యూహ్యమ్।**

ఒక్కొకవ్యక్తి ననుసరించి ధర్మము అధర్మమగును. అధర్మము ధర్మమగును. ఇట్లే కాలము ననుసరించియు ధర్మాధర్మములు మారుటకలదు.

ఎట్లన. - ఆపదలేనపుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు, శూద్రులయన్నము నుదకము పుచ్చుకొనుట యధర్మము. ఆపద సంభవించినపుడు ద్విజులు ద్విజేతరుల యన్నోదకముల స్వీకరించుట యధర్మముకాదు. ఈ విషయముపనిషత్తులలో స్ఫుటముగా వ్రాయబడియున్నది. వితంతువునకు సంతానేచ్ఛ కలిగెనేని ఆమె మరదిద్వారా సంతానము బడయుట పూర్వయుగమున ధర్మమైయుండెను. ఇపుడది యధర్మము. కాలముననుసరించి యిట్లెన్నియో ధర్మములు మారియున్నవి.

**44. ఏవం ధర్మాధర్మవ్యవస్థాయా లోకతో సిద్ధత్వాత్తద్వ్యవస్థాపనార్థం ధర్మశాస్త్రం ప్రవర్తితమీశ్వరేణ, శిష్టైశ్చ తదనుసృతమ్। తస్మాద్ధర్మశాస్త్రాత్ శిష్టాచారాద్వా ధర్మోఽయమస్య పునరధర్మోఽయమస్య ఇతి వివేకతో విదిత్వా అధర్మం పరిత్యజ్య ధర్మ ఏవానుష్ఠేయః॥**

*శిష్టాచారము:-* పై విధమున ధర్మము ప్రపంచస్థితినిబట్టి సిద్ధించుచున్నది. కాని ప్రపంచరీతు లనేకవిధములుగ నున్నవి గాన ధర్మవిషయమై యిదమిత్థమని తేల్చుటకు ధర్మశాస్త్రమును పరమేశ్వరు డనుగ్రహించెను. శిష్టులు దాని ననుసరించిరి. కావున ధర్మశాస్త్రము నుండిగాని, శిష్టుల యాచారము నుండిగాని యిది ధర్మము ఇది యధర్మము అని తెలిసికొని బుద్ధిమంతు డధర్మమును విడచి ధర్మము నాచరింపవలెను.

**45.** స్వపరద్రోహరహితః పరోపకారో లోకస్య ధర్మః పరమః। స్వద్రోహశ్చ ద్వివిధః-ఉపవాసాదినా స్వశరీరహింసారూపః, పూర్వార్జితాగ్రహారాది విక్రయేణ స్వజనహింసారూపశ్చ, పరద్రోహశ్చ పరవిత్తాద్యపహరణరూపః, స్వద్రోహేణ పరద్రోహేణ వా యః పరోపకారం కరోతి, స నైవ ధార్మికః యస్తు స్వద్రోహం పరద్రోహఞ్చాకృత్వా పరోపకారీ భవతి, స ఏవ ధార్మికః। కలియుగే పరం దుర్లభః॥

*ఉత్తమమగు లోకధర్మము:-* తనకుగాని యితరునకుగాని కష్టము కలుగనీయక

పరోపకారమొనర్చుట లోకధర్మము. తనకు కలిగెడి కష్టము లెవ్వియన నవి రెండువిధములు.

1. ఉపవాసాది వ్రతములద్వారా శరీరహింసనము.

2. పూర్వులార్జించిన యగ్రహారము మున్నగు ఆస్తిని విక్రయించి కుటుంబమును కష్టములపాలు జేయుట.

పరులకు కలిగెదు కష్ట మెట్టిదన-పరులధనము స్త్రీలు మున్నగువాని నపహరించుట. ఇట్టిబాధలు కలుగజేయుచు నెవడు పరోపకార మొనర్చునో అతడు ధార్మికుడుకాడు. తనకుగాని యన్యులకుగాని ఎట్టిబాధయు కలుగనీయక పరులకపకారమొనర్చువాడే ధార్మికుడు. ఇట్టి యుత్తముడు కలియుగమున చాలదుర్లభుడు.

**46. ప్రాయేణేదానీం దరిద్రాః పుమాంసో విధవాశ్చ దమ్భాద్యర్థం యాఞ్చయా ధనికజనమాపీడ్య లబ్ధద్రవ్యేణేష్టాపూర్తాని కుర్వన్తి, ద్రవ్యద్వారాణి పుణ్యానీతి వచనాదేతేన ధనికజనస్యైవ పుణ్యం మహత్। యాచకానాం కర్మిణాన్తు స్వల్పమేవ। యే తు ప్రభూతభూమయో వినైవ యాచనం సత్కర్మాణి కుర్వన్తి తేపితత్కర్మఫలం సుకృతం స్వల్పమేవోపయన్తి। మహత్తు భూమిదాతార ఏవ।**

**కలియుగధార్మికులు:-** సామాన్యముగ నిపుడు దరిద్రులైన పురుషులును వితంతువులును తాము గొప్పధార్మికులమనిపించుకొనుటకు ధనికులను పీడించి యాచించి ధనము సేకరించి దానితో దేవాలయముల గట్టించుట బావుల ద్రవ్వించుటయు చేయుచుందురు. ఈపున్నెమంతయు తమ దేయని తలచు చుందురు. కాని ద్రవ్యముద్వారా పుణ్యము లభించునని శాస్త్రము తెల్పుచున్నది. కావున వారొనర్చిన సత్కార్యములపుణ్యము ద్రవ్యదాతలకే చెందును. సేకరించిన వారికి స్వల్ప పుణ్యము మాత్రమే లభించును. మఱియొక విషయము చూదుడు! కొందఱు గొప్ప భూస్వాము లన్యుల యాచింపకయే సత్కార్యముల జేయుచుందురు. వారికి లభించు పుణ్యముగూడ స్వల్పమే! అట్టివారు తమకుగల భూమిని గొంతదాన మొనర్చినచో గొప్ప సుకృతము లభించును.

**47. యస్తు విహితయా వృత్త్యా స్వశక్త్యార్జితేన ధనేన సత్కర్మాణి కరోతి స మహాఫలః, స్వార్జితం హి ధనముత్తమమ్। ఉత్తమం స్వార్జితం విత్తం మధ్యమం పితురార్జితం అధమం భ్రాతృవిత్తఞ్చ స్త్రీవిత్తమధమాధమమ్ ఇతి వచనాత్।**

**ఇదం చోత్తమం ధనం ప్రాయేణ వణిజాం వైశ్యానామస్తి వాణిజ్యే వసతే లక్ష్మీస్తదర్ధం కృషికర్మణి తదర్ధం రాజసేవాయాం భిక్షాయాం నైవ నైవ చేతి వచనాత్। వాణిజ్యస్య చ వైశ్య ధర్మత్వాత్।**

***ధనములో తారతమ్యము:-*** ఎవడు శాస్త్రసమ్మతమైన వృత్తినవలంబించి తన శక్తి కొలది సంపాదించి దానితో సత్కర్మల నాచరించునో ఆతనికి గొప్ప సుకృతము లభించును. ఏలయన-స్వార్జితమైన విత్తము శ్రేష్ఠమైనది.

స్వార్జితవిత్తము ఉత్తమము-తండ్రి యిచ్చినది మధ్యమము-సోదరుల ధనము అధమము స్త్రీధనము అధమాధమమైనది యని శాస్త్రము నుడువుచున్నది.

ఉత్తమధనము విశేషముగ వైశ్యులకడ నుండును. లక్ష్మి యెచట నుండుననగా-శాస్త్రముమిట్లు తెల్పుచున్నది-వ్యాపారమున లక్ష్మియుండును. వ్యవసాయమున సగము(సంపద) ఉండును. ఉద్యోగమున నాల్గవవంతు ఉండును. భిక్షాటనములో బొత్తిగానుండదు. వ్యాపారము వైశ్యవృత్తి గాన నతని ద్రవ్యము స్వార్జితమైనందున అది యుత్తమము.

**48. బృహదారణ్యకే హి శ్రూయతే యజ్ఞార్థం బ్రాహ్మణాస్సృష్టాః, తద్రాక్షార్థం తు క్షత్రియాః ధనం వినా యజ్ఞస్యానిర్వాహోద్ధనార్థం వైశ్యాః, సోమలతాహరణాది కర్మకరణార్థన్తు శూద్రా ఇతి।**

***వర్ణములు వృత్తులు:-*** దేవతలకు, హవిస్సు నొసంగుటకు బ్రాహ్మణులు సృజింపబడిరి. వారొనర్చుయజ్ఞములను నాస్తికులు మున్నగునుపద్రములనుండి రక్షించుటకు క్షత్రియులు సృష్టింపబడిరి. ధనము లేనిది యజ్ఞము నెరవేరదుగాన ధనార్జనమునకై వైశ్యుల సృష్టియు, యజ్ఞమునకు గావలసిన 'సోమలత' మున్నగు పదార్థముల దెచ్చుటకు శూద్రుల సృష్టియు జరిగెనని బృహదారణ్యకోపనిషత్తు వెల్లడించుచున్నది.

**49. బ్రాహ్మణస్య తు ఉఞ్ఛఃకణశ ఆదానం కణికాద్యార్జనం శిలమిత్యుఞ్ఛ వృత్తిరుత్తమా, శిలవృత్తిర్మధ్యమా, అమృతం స్యాదయాచిత మిత్యమృతవృత్తి రధమా। మృతాఖ్యా యాచ్ఞావృత్తిస్తు అధమాధమా। అన్యాస్తు వృత్తయోऽ తీవనిన్ద్యాః- ఏవం స్థితే కలావస్మిన్ శిలోఞ్ఛామృతవృత్త్యభావన్మృతవృత్తి రేవ బ్రాహ్మణానాం సిద్ధా-బ్రాహ్మణస్య ధనం భైక్షమితి వచనాత్।**

*బ్రాహ్మణవృత్తి:-* బ్రాహ్మణునకు 1 ఉంఛవృత్తి 2 శిలవృత్తి 3 అమృతవృత్తి అని

మూడు తెఱంగులగు వృత్తులు కలవు.

*(1)* **ఉంఛము** = ఒక్కొక్కగింజ నేరుకొనుట.

*(2)* **శిలవృత్తి** = పొలములో యజమాని పంట తీసికొనిన పిదప కంకుల నేరికొనుట.

*(3)* **అమృతము**= యాచనలేక తమంతదాము తెచ్చి యిచ్చిన పదార్థము.

పైవిధముగా జీవించుట ఆయావృత్తులందురు. అందుంఛవృత్తి యుత్తమము, శిలవృత్తి మధ్యమము. అమృతవృత్తి యధమము. యాచనావృత్తి అధమాధమము. దానికి మృతవృత్తియని మారుపేరు. ఇవిగాక యితర వృత్తులు విప్రునకు మిక్కిలి నింద్యములు. ఇట్లుండ పై దెల్పిన మూడువృత్తులు కలికాలమున జరుగనందున యాచనారూపమైన మృతవృత్తియే వీరికి శరణ్యమైనది. "బ్రాహ్మణునకు భిక్షావృత్తియే ధనము." అని శాస్త్రము సైతమంగీకరించెను.

**50. నన్వేనం యాచ్ఞావృత్త్యా స్వల్పం ధనం లబ్ధ్వా బ్రాహ్మణః కథమిష్టాపూర్తాని కరిష్యతీతి చేదుచ్యతే- మహతోఽ న్నాదేర్దానాద్ధనికో యద్గచ్ఛతి సుకృతం, తతోఽ ధికమేవ సుకృతం దరిద్రస్య స్వల్పాన్నాదిదానాద్భవతి-యాతః క్ష్మామ-ఖిలాం ప్రదాయ హరయే పాతాలమూలమ్బలిః, సక్తుప్రస్థవిసర్జనాత్స చ మునిః స్వర్గం సమారోపిత ఇతి వచనాత్। కిఞ్చోపనిషత్సు ప్రసిద్ధేయం కథా।**

*ప్ర:- బ్రాహ్మణునకు యాచన తప్ప తక్కినవి నింద్యమైన యెడల అతనికి లభించు స్వల్పధనముతో యజ్ఞయాగముల నెట్లు జేయగలడు?*

*ఉ. -ఓయీ ధర్మసూక్ష్మము దురవగాహము. దరిద్రుడైనంతమాత్రమున పుణ్యమునకు దారి లేక పోలేదు. శ్రద్ధ ప్రధానమైనది. ధనవంతుడు తన వైభవముకొలది చేసిన దేవతార్చనముతో నెంత సుకృతము సంపాదించునో, దరిద్రుడును తన శక్తి కొలది ద్రవ్యము వెచ్చించి శ్రద్ధాపూర్వకముగ జేసిన దేవతార్చనముతో నంతకన్న నెక్కువ సుకృతమునే బడయును. భూమండలము నంతయు దానము చేసి బలిచక్రవర్తి పాతాళమున బడెను. పేలపిండి నొసంగిన కుచేలునకు స్వర్గపదవి లభించెను. ఇందుకుదాహరణముగ నొక యుపనిషద్గాథ వినిపింతును. వినుము.*

**51.** కశ్చిద్దరిద్రః పటోలికాదానేన జన్మాంతరే ప్రభూతధనో భూత్వా జాతిస్మరత్వేన తదానీమపి పటోలికాదానం కృత్వా తృతీయే జన్మని పునరపి దరిద్రోఽ భూదితి తస్మాద్వృథా విత్తం దానం కుర్యాత్।

శక్తికితగిన దానము:- ఒక దరిద్రుడు కుటుంబసంరక్షణము చేసికొనజాలక మిక్కిలి బాధపడు చుండెను. ఒకనాడు తన పెరటిలో నున్న పొట్లకాయ నాదరిద్రుడొకనికి దానముచేసెను. అందుకు ఫలముగా మరుచటి జన్మమున ధనికుడై జన్మించెను. ఈశ్వరుని కృపచే నతనికిపూర్వజన్మ జ్ఞానము కలిగెను. ఒకదినము తనయైశ్వర్యమునకు హేతువెద్దియామని యాలోచన నేయుచుండ పూర్వజన్మమున పొట్లకాయ యిచ్చినందులకిది ఫలితమని గోచరించెను. అంతనతడు గో భూదానముల నిచ్చుట మానివేసి బ్రాహ్మణులకు పొట్లకాయలనీయసాగెను. తత్ఫలితముగ నుత్తర జన్మమునందు దరిద్రుడై జన్మించెను. కావున తనశక్తికి తగినట్లు దానము చేయవలెను.

**52. దానేషు చ సర్వేష్వన్నదానం ముఖ్యమిత్యుపనిషదుద్ఘోషః తథాహి నిరన్నస్య శరీరేన్ద్రియహృదయవ్యాపారాయోగత్తామసీ దశా సమ్భవతి-సాన్నస్తు సజ్జనః అధీతిబోధాచరణప్రచారణాని వేదస్య కురుతే, మనసా భగవన్తం చ ధ్యాయతి। ఋతౌ దారగమనం విధాయ పుత్రాంశ్చోత్పాదయతి। ఏవం సజ్జనేనోపభుక్త మన్నం ధర్మాయ కామాయ మోక్షాయ చ భవతీతి యస్సుజ్జనాయాన్నం దదాతి న తత్సు కృతం ప్రయాతి। అతఏవ పరమహంసాయ బ్రహ్మవిదే భిక్షాదానమపార సుకృత ప్రదమితి వదన్తి। కిమ్బహునా! జాతస్సుతోప్యన్నదాతు రేవ, న త్వన్నభోక్తుః। "దేహః కిమన్నదాతుః స్వ"మితి భాగవతాత్।**

దానములలో నుత్తమమైనది:- దానము లన్నిటియందన్నదానము శ్రేష్ఠమైనదని యుపనిషత్తులు ఘోషించుచున్నవి.

ఏలయన- అన్నములేని వానికి శరీరము ఇంద్రియములుమనస్సునెద్దియు పనిసేయక అయోమయ స్థితి వచ్చును. అది తమోవృత్తి. అందువలన జీవునకు ప్రమాదము వాటిల్లును. అన్నము గల్గినచో సజ్జనుడు వేదాధ్యయనమునకు దానిని బోధించుటకు వేదధర్మము లాచరించుటకు వానిని ప్రచారము సేయుటకును సమర్థుడగును. మనస్సు భగవద్ధ్యానము చేయుటకు శక్తి కల్గియుండును-దృఢగాత్రుడై ఋతుకాలమున భార్యతో గ్రీడించి పుత్రుల బడయును. ఇటుల సత్పురుషుడు భుజించిన యన్నము ధర్మమును కామమును మోక్షమును సంపాదించును. కావున సత్పురుషునకెవ రన్న దానము చేయుదురో వారాతని సుకృతమును చూరగొందురు. కావుననే బ్రహ్మవేత్తయగు పరమహంససన్న్యాసికి భిక్షసేయుటవలన సుకృత మపారముగ లభించునని పెద్దలు వక్కాణింతురు. వేయేల ఎవని యన్నము దినినశక్తి

వలన నెవనికి పుత్రుడుదయించునో అపుత్రుడన్న దాతకే జెందుననియు భుజించిన వానికి కాదనియు భాగవతము నుడువుచున్నది. (అనగా నాతడొనర్చు సత్కార్యముల ఫలము అన్నదాతకు జెందునని భావము.)

**53. నన్వనేన న్యాయేన దుర్జనాయాన్నదానం దుష్కృతప్రదమేవేతి చేత్సత్యమత ఏవ సజ్జనాయాన్నం దేయమితి వదన్తి, సత్కర్మసు బ్రాహ్మణేభ్య ఏవాన్నం దదతి, న తు మ్లేచ్ఛాదిభ్యః కుశలాః। తథా విద్యాదానం చ ముఖ్యమ్। తాసు చ విద్యాస్వధ్యాత్మవిద్యాదానమతీవముఖ్యమ్। మోక్షప్రదత్వాత్తస్యాః। స్వయం తీర్ణః పరాన్ తారయేదితి న్యాయాత్తత్త్వవిదాఽవశ్యం దాతవ్యేయం సచ్ఛిష్యాయ। ఏవం శాశ్వతవృత్తి హేతుత్వాద్భూదానం చ ముఖ్యమేవ। వంశప్రతిష్ఠాపకత్వా త్కన్యాదానం చ ముఖ్యమ్।ఏతత్ప్రతిగ్రహస్తు న దోషః। ఏతద్భిన్నప్రతిగ్రహస్తు దోషః। దగ్ధో హస్తః ప్రతిగ్రహాదితి స్మరణాత్।**

ప్ర:- అటులైన దురాత్మున కన్నదానము సేయుటచే పాపము లభించునా?

ఉ:- ఔను. కావుననే సత్పురుషులకే అన్న మీయవలెనని పెద్దలు వచింతురు. సత్కార్యములపట్ల బ్రాహ్మణులకే సమారాధనము చేయుదురు కాని మేచ్ఛుల కన్నమిడరు.

**కొన్ని ముఖ్యమైన దానములు:-** ఇన్ని విద్యాదానము కూడా ముఖ్యము. అందును వేదాంతవిద్యాప్రదానము మిక్కిలి ముఖ్యమైనది. ఏలయన అయ్యది మోక్షదాయకము. "తాను తరించి యితరుల తరింప జేయవలె" నని శాస్త్రజ్ఞులు వచించు చుందురు గాన సంసారార్ణవమును తరించిన తత్త్వవేత్తలు సచ్ఛిష్యునకు వేదాంతశాస్త్రము వచించుట ధర్మము.

శాశ్వతాదాయమునకు గారణముగాన భూదానముకూడా ముఖ్యమే. వంశప్రతిష్ఠకు కారణముగాన కన్యాదానముకూడా ముఖ్యమే. వీనిని స్వీకరించుటలో దోషములేదు. తక్కినవి ప్రతిగ్రహించుట దోషావహము. దానముల బట్టుటచే హస్తములు దగ్ధమయ్యెనని స్మృతి వచించుచున్నది. (అనగా దానము పట్టినవాడు నిర్వీర్యుడగునని భావము.)

**54. న చ బ్రాహ్మణస్య ధర్మ్య ఏవ ప్రతిగ్రహ ఇతి వాచ్యమ్। యోగ్యాద్యోగ్యస్యైవ ప్రతిగ్రహో బ్రాహ్మణస్యాపి ధర్మ్య ఇతి సిద్ధాన్తాత్। హేమాద్ర్యాభిస్తిలాదిప్రతి-**

గ్రహాణాం ప్రాయశ్చిత్తాని హ్యభిహితాని।

ప్ర:- బ్రాహ్మణుడు ప్రతిగ్రహమొనర్చుట ధర్మము

ఉ:- యోగ్యమైన పదార్థముల గ్రహించుటే బ్రాహ్మణునకు ధర్మమని శాస్త్రాశయము. కావుననే హేమాద్రిమున్నగు ధర్మనిర్ణేతలు నువ్వులు మున్నగువస్తువుల బరిగ్రహించినందులకు బ్రాయశ్చిత్తము వచించిరి.

**55. తచ్చ దానం ప్రత్యుపకారమనపేక్ష్య కుర్యాత్। కిఞ్చదాత్రైవమభిసన్దధ్యాత్ "సర్వం వస్త్వీశ్వరీయమేవ। అహమపీశ్వరీయ ఏవ, ప్రతిగ్రహీతా చాయమీశ్వర ఏవ। ఏతత్ఫలమపి బ్రహ్మార్పణమేవాస్తు" ఇతి। న కేవలం దాన ఏవాయం విధిః, కిన్తు సర్వేష్వపి విహితేషు। తథా చ గీతా-బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్। బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా-ఇతి। య ఏవం ధర్మకృత్పురుషస్స చిత్తశుద్ధిజ్ఞానప్రాప్తి ద్వారా మోక్షమధిగచ్ఛతి।**

ఇతి బెల్లంకొండోపనామక రామకవికృతా ధర్మప్రశంసా

శ్రీ హయగ్రీవార్పణమ్. (పరీధావి చైత్ర శు14)

శ్రీః

దానము చేయునపుడు ప్రత్యుపకారము నవేక్షింపక చేయవలెను. ఆసమయమున దాత యిట్లనుకొనవలెను. "*జగత్తునందలి పదార్థములన్నియు నీశ్వరుని సంబంధమైనవి. నేను భగవతుని సంబంధినే. ఈదానము స్వీకరించు వాడీశ్వరుడే. దీనివలన గల్గుఫలము పరమేశ్వరునకే చెందుగాక!*" ఈతలంపు ఒక దానవిషయముననే కాదు. సమస్తకార్యములందును ఇట్టి బ్రహ్మభావనయే జీవునకు కర్తవ్యము. మనమొనర్చు సమస్తకర్మలును బ్రహ్మస్వరూపము. దేవతలకొసంగు ద్రవ్యము బ్రహ్మస్వరూపమే. అగ్నిహోత్రము బ్రహ్మమే. హోమమొనర్చువాడు బ్రహ్మ స్వరూపుడు. ఆతడు పొందుస్థానము బ్రహ్మమే, సర్వము బ్రహ్మమయము అని భగవద్గీత వచించుచున్నది. ఇట్టి బ్రహ్మ భావనతో ధర్మాచరణమొనర్చిన పురుషుడు చిత్తశుద్ధినిబడయును. పిమ్మట జ్ఞానోదయము కలిగి మోక్షసామ్రాజ్యము నధిగమించును.

ఇది

శ్రీ బెల్లంకొండరామరాయకవీంద్రుల శతాధికగ్రంథములందు

ధర్మప్రశంస.

(పరీధావి చైత్ర శు14న రచింపబడెను.)

శ్రీ హయగ్రీవర్పణమస్తు।

శ్రీః



శ్రీః

ఓం శ్రీ హయగ్రీవాయ నమః

# ధనవర్ణనమ్

1. స్త్రియో ద్యూతం పానం హింసా చేతి స్థానచతుష్టయం లబ్ధ్వాప్యపరితుష్యతే కలిపురుషాయ సువర్ణం స్థానాన్తరం దత్తం కలిజితా పరీక్షితా భూభృతా పురా। ప్రసిద్ధమిదం భాగవతే, తచ్చ ధనస్థానం ప్రాప్య తుష్టోఽభూత్కలిః ధనాధీనత్వా త్స్త్ర్యాదిస్థానచతుష్టయస్య, ధనాభావే తన్నిర్వహణాయోగాత్। ధనేన హి పురుషో వేశ్యాదిస్త్రీసజ్జితో భవతి, అక్షైశ్చ దీవ్యతి, మదిరామ్పిబతి, పశూంశ్చ క్రీత్వా హినస్తి కలావుపలభ్యమానాస్సర్వే చ దోషా ధనమాశ్రిత్యైవవర్తన్తే।

పూర్వకాలమున కలిమాయను జయించిన పరీక్షిన్మహారాజు కలిపురుషుని సాగనంపుటకై స్త్రీలు-జూదము-మద్యము-మాంసము అనెడి నాల్గుస్థానముల నాతనికి జూపెను కాని తృప్తి జెందదయ్యె. అంతట సువర్ణ (ధన) మనెడి మఱి యొక స్థానము నిచ్చెను. ఈవిషయము భాగవతమున బ్రసిద్ధమైయున్నది. ధన స్థానమును బడిసి కలిపురుషుడు తృప్తి జెందెను. ఏలయన-తక్కిన నాల్గు స్థానములు ధనమునకు లోబడియుండును. ధనములేనిదే అందెద్దానినిగూడ నిర్వహించుటకు వలనుపడదు. ఎట్లందురా...... ధనమువలననే-పురుషుడు వారకాంతల గూడును: జూదమాడును:మద్యపానమొనర్చును. పశువులగొని హింసించును. కలికాలమున గోచరించు దోషములన్నియు ధనము నాశ్రయించియే యున్నవి.

2. తథా హి:- ధనకృతే బ్రాహ్మణోఽపి చౌర్యం ద్యూతం వా కరోతి తదుక్తమ్:-

శ్లో॥ భిక్షో!మాంసనిషేవణం ప్రకురుషే? కిన్తేన! మద్యం వినా
మద్యఞ్చాపి తవప్రియమ్? ప్రియమహో! వారాఙ్గనాభిస్సమమ్।
వేశ్యాప్యర్థరుచిః కుతస్తవ ధనమ్? ద్యూతేన చౌర్యేణ వా!
చౌర్యద్యూతపరిగ్రహోస్తి భవతో? భ్రష్టస్య కా వాగతిః?॥ ఇతి॥

ధనముకొఱకు బ్రాహ్మణుడు సయితము చౌర్యమునో ద్యూతమునో చేయును. ఈవిషయమున నీక్రింద సంవాదమును జూడుడు. ఒక సన్యాసి మాంసభక్షణము సేయుచుండగా నొకగృహస్థుడు జూచి యిట్లడిగెను.

*గృహ:-ఓయీ! పరివ్రాజకా! నీకు మాంసభక్షణము సేయుట తగునా?*

*సన్యాసి:- మద్యము లేనిదే దీనియందు పసలేదు.*

*గృహ:- ఓహో మద్యము కూడ నీకు బ్రియమా?*

*సన్యాసి:- వారాంగనలుకూడా ప్రియమే.*

*గృహ:- వారకాంతలు ధనప్రధానలు. నీకుధనమెట్లువచ్చును?*

*సన్యాసి:- జూదమో చౌర్యమో ఆశ్రయించిన ధనము వచ్చును.*

*గృహ:- చౌర్య ద్యూతములలో గూడ నీకు పరిచయము కలదా?*

*సన్యాసి:- లేనిచో భ్రష్టునకు గతియెద్ది?*

ఈసంవాదము వలన ధనముకై పురుషుడెన్ని పాటులనైన బడునని తెలియుచున్నది.

**3. నిన్దితమపి కృషి-వాణిజ్య- వృద్ధివ్యాపార- రాజుసేవన- భృతకాధ్యాపన- తౌర్యత్రిక -యుద్ధాన్నవిక్రయ కన్యావిక్రయ, భార్యావేశ్యీకరణ- మిత్రద్రోహ -విశ్వస్తఘాతప్రముఖదుష్కార్యచయమాచరతి। స్త్రీ బాల వృద్ధాదిహననఞ్చ కురుతే। తదేవం ధనస్య లబ్ధయే,లబ్ధస్య ధనస్య వృద్ధయే చ, బహూని పాపాని విదధతి।లబ్ధేన చ ధనేన బహూని పాపాని విదధతి। ఏవం సర్వపాపాశ్రయత్వా-దేవ కలిపురుషస్య ప్రధానం స్థానం ధనమ్। పాపమయో హి కలిః॥**

సేద్యము-వ్యాపారము-రాజసేవ-జీతమునకు వేదము చెప్పుట-సంగీతము-యుద్ధము- అన్నవిక్రయము- కన్యావిక్రయము- భార్యను పడుపువృత్తిలోనికి దింపుట- మిత్రద్రోహము నమ్మినవారిని మోసగించుట మున్నగు శాస్త్రనిందితము లగు దుష్కార్యముల నెన్ని యేని ధనముకై యాచరింతురు. స్త్రీలను శిశువులను వృద్ధులను హత్యచేయుదురు. ఈరీతి ధనము సంపాదించుటకును, కూడిన ధనము వృద్ధిసేయుటకును పెక్కు పాపకృత్యముల నాచరించుచుందురు. సంపాదించిన ధనమువలనను జాల పాపకార్యముల జేయుచుందురు. ఈవిధముగ సమస్త పాపములకు నాశ్రయమగుటంజేసి ధనము కలి పురుషునకు బ్రధానస్థానముగ నేర్పడెను. కలి పురుషుడు పాపమయుడు గదా!

**4. ఇదఞ్చ ధనం స్వాశ్రయస్య పురుషస్య బహుధా దుఖఃమేవ కరోతి, న**

తు సుఖమ్। అర్థానామార్జనే దుఃఖం తథైవ పరిపాలనే నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్క్లేశకారిణ ఇతి వచనాత్।

ధనము ఎవరినాశ్రయించియుండునో ఆతనికి బహు విధముల దుఃఖము కలుగ జేయును. కాని సుఖము కలుగజేయదు. ఎట్లన-ధనము సంపాదించునపుడు కష్టము. దానిని సంరక్షించుటలో గష్టము. అధనము నశించిన గష్టము. ఖర్చయిన గష్టము, ఇట్లిన్నివిధములగు గష్టములకు నిలయమైన ధనము నింద్యమైనది.

5. అతఏవ- "అర్థమనర్థం భావయ నిత్యం నాస్తి తతస్సుఖలేశస్సత్యమ్, పుత్త్రాదపి ధనభాజాం భీతిస్సర్వత్రైషా విహితా రీతి" రిత్యాచార్యైరుక్తమ్। అర్థీ హి పుత్త్రమిత్రకళత్రాదిస్వజనైరర్థిజనైః రాజపురుషైః చోరజనైశ్చ బాధ్యతే। తృష్ణయా స్వార్జితం పిత్రార్జితం వా ధనం త్యక్తుం న శక్నోతి।

కావుననే శ్రీశఙ్కరాచార్యులవారిట్లు బోధించిరి. మూర్ఖుడా!ధన మనర్థదాయకమని గుర్తింపుము! దానివలన సుఖమిసుమంతయులేదు. ధనవంతులకు దమ పుత్రుల జూచినను భయమొదువు చుండును. లోకమందంతట నీవిషయము ప్రసిద్ధమై యున్నది." ధనవంతుడు భార్యాపుత్రాదులచేతను యాచకులచేతను ఉద్యోగస్థుల చేతను దొంగలచేతను భాధింపబడును. ఆశ వలన స్వార్జితధనముగాని పిత్రార్జితమును గాని ఖర్చు పెట్టడు.

6. శ్లో॥ ప్రాయో ధనవతామేవ ధనే తృష్ణా గరీయసీ।
పశ్య కోటిద్వయాసక్తం లక్షాయ ప్రవణం ధనుః॥ ఇతి వచనాత్।

యయా కయాపి బాధయా ధనైకదేశస్యాపి త్యాగాద్భృశం ఖిద్యతే। ధనత్యాగాత్ప్రాణత్యాగమేవ వరం మన్యతే ధనికః।

శ్లో॥ వేధా ద్వేధా భ్రమంచక్రే కాన్తాసు కనకేషు చ।
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతి॥ రిత్యత ఏవ స్మర్యతే॥

ఒక మహాకవి ధనాశనుగూర్చి చమత్కారముగ నిట్లు వచించెను. సామాన్యముగా ధనికులకే ధనమందెక్కువ యాశయుండును. చూడుము రెండుకోటులతో (అంచులతో) సంబంధము గలిగిన ధనస్సు లక్ష్యమై యెదురుచూచుచుండును. ఇచట శ్లేషమర్యాదవలన రెండర్థములు తెలియుచున్నవి. ఎట్లన- రెండుకోట్ల ధనముగలవాడు మఱియొక లక్షకై కృషి సేయుచుండునని యొక యర్థము, కోటి

అనగా అంచు అని రెండవయర్థము. లక్షమనగా లక్ష్యము. రెండంచులను బిగించిన ధనస్సు లక్ష్యమునకు సిద్ధమగుచున్నదికదా! ఎద్దియేనియొక కష్టము వాటిల్లి ధనము గొంతవ్యయమైనను ధనికుడు దుఃఖించును. ధనముపోవుటకంటె ప్రాణముపోవుటే మంచిదని, యతడు దలంచును. కావుననే "బ్రహ్మదేవుడు మానవులకు రెండు విధములగు మోహము సృజించెను. *1)* కాంతలందు *2)* ధనములందు. ఈ రెంటియందు మోహము జెందనివాడు మనుష్యరూపము ధరించిన పరమేశ్వరు డనియే చెప్పవచ్చును. అనియొక స్మృతివాక్యము తెలుపుచున్నది.

**7. కిఞ్చాయం ధనికో యద్యపాత్రే యయా కయాపి బాధయా ధనం దత్తే। తర్హి తేన ధనేన యద్యత్పాతకం సప్రతిగ్రహీతా కరోతి, తస్య తస్య సర్వస్యాప్యంశ మయం దాతా భజతే। ధనేన చ మత్తః స్వల్పమూల్యేనైవ పరద్ర వ్యాణి గోభూమ్యాదీన్యపహరతి।**

ధనికుడు తప్పునిసరియై యొకయపాత్రునకు గొంత ధనమిచ్చుట సంభవించును. ఆధనముతో నే యే పాపకార్యము లొనర్చునో వానియన్నిటినుండి గొంతభాగము దాతకు సంక్రమించును. మఱియు ధనికుడు సమయము గనిపెట్టి పేదవారినుండి గోవులను భూములను కొద్దిధరలకు గొనివేయుచుండును.

**8. ధనరక్షార్థం బహూన్ఖలాన్స్వవశీకృత్య పరదారాం శ్చాపహరతి। తైశ్చ ఖలై ర్మాంసార్థం బహవః పశవో గవాదయశ్చ హింస్యన్తే-గూఢం ప్రకాశం వా న చ మాంసభక్షణార్థం పశువిశసనం యుక్తమేవేతి వాచ్యమ్। యజ్ఞార్థం పశువిశ -సనమేవ యుక్తమ్। న మాంసభక్షణార్థమ్। "యజ్ఞార్థం పశవస్సృష్టా" ఇతి శాస్త్రాత్।**

ధనరక్షణమునకై పెక్కుదుర్మార్గులను జేరదీయును, పరకాంతల నపహరించును. అటులజేరిన దురాత్ములు మాంసార్థమై గోవులు మున్నగుమృగములను రహస్యము గనో ప్రకాశముగనో వధింతురు. మాంసమునకై పశువుల జంపుట యుక్తమే కదా అని తలచరాదు. యజ్ఞమునకై పశువులు సృష్టింపబడినవని శాస్త్రము తెలుపుచున్నదిగాన యజ్ఞనిర్వహణమునకు మాత్రమే పశువుల వధింపవచ్చును. మాంసమునకై పశువుల వధించుట యుక్తముగాదు.

**9. మాంసభక్షణం చాయుక్తమ్। - స్వమాంసం పర మాంసేన యో వర్ధయితు మిచ్ఛతి। అనభ్యర్చ్య పితౄన్దేవాంస్తతోఽ న్యో నాస్త్యపుణ్యకృదితి। మాంస**

**భక్షయితాஉ ముత్ర యస్య మాంసమిహాద్మ్యహమ్, ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదన్తి మనీషిణ ఇతి మను వచనాత్।**

మాంసభక్షణమును శాస్త్రమెటుల నిందించెనో చూడుడు- “ఇతర మాంసములతో దనమాంసమును వృద్ధిజేయ నెవడు దలపెట్టునో ఆతనికన్న పాపవర్తనుడు మఱియొకడు లేడు. పితృదేవతలను నారాధించునపుడు మాత్రము దోషము లేదు. “మాంస” పదమునుగూర్చి మనుస్మృతి యెట్లు నిర్వచించెనో చూడుడు!- మాంసార్థమై వధింపబడు పశు విట్లను కొనునట! మాం (నన్ను) సః (అతడు) భుజించును- ఎవని మాంసమును నేను పరలోకమున భుజింతునో- అని. ఈ మాం స పదములే మాంస పదమయ్యెనని భావము.

**10. మాంసవర్జనాచ్చ మహాఫలం భవతి। “వర్షే వర్షేஉ శ్వమేధేన యో యజేత శతం సమాః మాంసాని చ న ఖాదేద్య స్తయోః పుణ్యఫలం సమమితి మను వచనాత్।**

మాంసభక్షణము మానివేయుటవలన మహత్తరమగు సుకృతము లభించునని యీక్రింది మనువచనము దెల్పుచున్నది. ప్రతిసంవత్సర మొక యశ్వమేధయాగము చొప్పున నూరుసంవత్సరములాచరించిన నెంతటి సుకృతము లభించునో మాంస భక్షణము మానివేసినవాని కంతటి సుకృతము ప్రాప్తించును.

**11. నను “న మాంసభక్షణే దోషా న మద్యే న చ మైథునే ప్రవృతిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫ” లేతి మనువచనాదదుష్టమ్మాంసభక్షణ మితి చేన్నైవమ్। జ్యోతిష్టోమాదౌ సౌత్రామణ్యాదౌ స్వదారేషు ఋతు కాలే చక్రమేణ త్రయాణాం తేషామదుష్టత్వేஉ ప్యన్యత్ర దుష్టత్వమేవ।**

మాంసభక్షణము-మద్యపానము-మైథునము ఇవి మానవులకు సహజముగా పట్టుబడు విషయములు గాన వీనిలో దోషములేదనియు, పట్టుబడిన దానిని విడచుటయే మహాఫలదాయకమనియు, మనుస్మృతిబోధించుచున్నందున మాంస భక్షణము దోషావహము కాదని తలంతు రేమో! అది పొరబాటు. జ్యోతిష్టోమమున మాంసభక్షణము - సౌత్రామణియందు మద్యపానము-ధర్మపత్నియందు మైథునము వీనికిమాత్రమే దోషము లేదు. తక్కినవిషయములందవి దోషావహము లని ధర్మశాస్త్రముయొక్క ఆశయము.

**12.** **కిఞ్చ యుగాన్తరేషు ద్విజానామ్మాంసభక్షణమస్తు నామ! కలౌ తన్నిషిద్ధ మేవ। పలపైతృకాదేర్నిషిద్ధత్వాత్। తథా ధనికః బలవర్ధక వస్తుసేవయా సుత్తస్సన్ దివామైథునా గమ్యాగమనాదీని చ కరోతి। సాధూంశ్చాధిక్షిపతి। కిమ్బహునా! అధనాశ్రయం యత్కిమపి నాస్త్యేవ దుష్కర్మ లోకే।**

ఇతరయుగములలో ద్విజులకు మాంసభక్షణము వలన దోషములేకుండుగాక! పలపైతృకాదులు నిషేధింపబడినవిగాన కలియుగములో అది దోషావహము. ఇట్టి నిందితకర్మలను ధనికుడొనర్చును. మఱియు ధనికుడు బలవర్ధక పదార్థముల సేవించుటచే మదించి దివాసంభోగము కూడని స్త్రీల పొందు మున్నగు నకార్యముల జేయును. సజ్జనుల నిందించును. వేయేల? ధనసంబంధములేని దుష్కార్యము ప్రపంచమున లేనేలేదు.

**13.** **ఏవం ధనాశ్రయదుష్కర్మకారీ ప్రపద్యతే యమలోకే బహ్వీర్యాతనాః, పునరుత్పద్యతే చ నికృష్టజాతిషు। క్రమేణ స్థావరతాఞ్చ ప్రయాస్యతీత్యహో ధనస్య దుష్టత్వమ్।**

ఇట్లు ధనమూలమున బాపకార్యముజేయువాడు యమలోకమున బెక్కు యాతనలకు గురియై మరుజన్మమున నీచజాతులలో జన్మించును. పిమ్మట బక్షి మృగాది జన్మములను ఆవల స్థావర జన్మమును బొందును గాన ధనము యొక్క దుష్టత్వ మింతయని చెప్పజాలము.

**14.** **తస్మాద్యో నరకం న జగమిషతి తేన నిర్ధనేనైవ భావ్యమ్। ఇతి। అత్రోచ్యతే। ధర్మార్థకామమోక్షాశ్చత్వారః పురుషార్థాః। తత్ర ధర్మకామమోక్షాస్త్రయోప్యర్థాధీనా ఏవేతి నాస్తి నిర్ధనస్య యః కోపి పురుషార్థః। తథాహి- నిర్ధనస్య తావత్ ద్విజస్యోపనయన సంస్కార ఏవ న సిద్ధ్యతి ధనసాధ్యత్వాత్తస్య।**

పై దెల్పిన కారణములనుబట్టి "యెవడు నరకమును దప్పించుకొనదలచునో అతడు నిర్ధనుడుగా నుండవలె" నని తేలుచున్నది. కాని, ఇదియంతయు నసంగతము. వినుడు:- ధర్మార్థకామమోక్షములని పురుషార్థములు నాలుగు. అందు ధర్మము కామము మోక్షము అను మూడుపురుషార్థములును అర్థమునకు లోబడియుండును గాన ధనహీనునకు బురుషార్థమెద్దియులేదు.

ఎట్లన- ధర్మాచరణమునకు మూలమైనది యుపనయనము, అది ధన సాధ్యమైనదికాన నిర్ధనునకుపనయనము గూడ సిద్ధింపదు.

**15.** న చ నిర్ధనో ధనికేనోపనీయతే ఇతి వాచ్యమ్। య ఉపనేతా తస్యాపి నిర్ధనత్వే కథం తత్సిద్ధిః? న చ పితుర్నిర్ధనత్వేపి పరేణ కేనచిదుపనీయతే ద్విజపుత్ర ఇతి వాచ్యమ్। తస్యాపి పరస్య నిర్ధనత్వే తదసిద్ధేః। తస్మాదుపనేత్రా తావద్ధనికేన భావ్యమ్।

ధనవంతుడు నిర్ధనున కుపనయనము గావించునందురా? అతడును నిర్ధనుడైన నుపనయన మెట్లు జరుగును? తండ్రి నిర్ధనుడైన మఱియొక ధనికు డుపనయనము జేయునందురా? అతడుగూడ నిర్ధనుడైన జేయునది యేమిగలదు? కావున నుపనయనము జేయువాడు ధనికుడై యుండవలెను.

**16.** అథ సోయముపనీతో యద్యధనస్తర్హ్యస్య గృహస్థాశ్రమ ఏవ న భవతి, గృహస్థాశ్రమస్య ధనప్రయుక్తత్వాత్ న హి నిర్ధనాయ ద్విజాయ కోపి కన్యాం ప్రదత్తే। న చ నిర్ధనాయాపి సవిద్యాయ కన్యాం దద్యాదేవ కశ్చిత్సుకృతీతి వాచ్యమ్। తస్యాపి కన్యాదాతుర్నిర్ధనత్వే కథనం వివాహ సిద్ధిః? వివాహో హి ద్రవ్యసాధ్యః।

కష్టపడి యెటులనో ఉపనయనము జరిగినను ధనము లేనిదే వివాహము జరుగదు. గృహస్థాశ్రమము ధనముపై నాధారపడినది. ధనహీనునకు గన్య నెవరిత్తురు? ధనము లేకున్నను విద్యావంతుడైనచో బుణ్యాత్ముడెవరైన గన్యనిచ్చు నందురా? ఆ కన్యాదాతకుగూడ ధనముగావలెను. లేని యెడల ద్రవ్యసాధ్యమైన వివాహమెట్లు జరుగును?

**17.** అథ కృతోద్వాహోప్యయం నిర్ధనః కథం సంసారం నిర్వహేత్? కథం వాఽతిథిపూజనాదీన్ కుర్యాత్?కథం వా గృహం సమ్పాదయేద్గృహే తిష్ఠన్హి గృహస్థ ఇత్యుచ్యతే। వసన్తేవసన్తేజ్యోతిషాయజేతేత్యాది శ్రుతివిహితాని జ్యోతిష్టోమాదీని నిత్యకర్మాణి విదధ్యాత్? విహితాకరణే హి పతితస్స్యాత్।

కష్టముమీద నెటులనో వివాహము జరుగునిందు. అపుడైనను నిర్ధనుడు కుటుంబ నిర్వహణమెట్లు జరుపును? అతిథుల నెట్లు పూజించును? ఒక యిల్లు కట్టుకొను టెట్లు? ఇంటియందు నివసించిన గదా యింటివాడు (గృహస్థుడు) అని పిలువ బడుట! గృహస్థునకు విధింపబడిన జ్యోతిష్టోమాది యాగముల నెట్లాచరించును? వేదవిహితకర్మల జేయని యెడల బతితుడగును గదా!

**18.** న చ నిర్ధనాయాస్మై ధనికః కశ్చిద్గృహభూమ్యాదిదానం కుర్యాదితి వాచ్యమ్। తస్యాపి దాతురధనత్వే కథం దానసిద్ధిః? ఏవమధనస్య విహితకరణాభావాన్న స్వర్గాదిప్రాప్తిః। నాపి చిత్తశుద్ధిప్రాప్త్యాదిద్వారా మోక్షసిద్ధిః, నాపి కామసిద్ధిః స్వస్యైవ భుక్తి శూన్యత్వే కథం భార్యాయా భుక్తిః? కథం వా తత్సంయోగజన్యం సుఖమ్। తస్మాద్యథా దుష్కర్మాణి ధనాశ్రయాణి, తథా సత్కర్మాణ్యపి ధనాశ్రయాణ్యేవ। ఇమే చ ధనగతదుష్టత్వశిష్టత్వే ధనాశ్రయపురుషగత దుష్టత్వశిష్టత్వప్రయుక్తే ఏవ న తు స్వాభావికే।

నిర్ధనుడైన గృహస్థునకు వేఱొక ధనికుడు గృహము భూమి మున్నగువానిని దానము చేయవచ్చునందురా? అతడుగూడ నిర్ధనుడైన దాన మెట్లు సిద్ధించును? ఈ విధముగ ధనహీనునకు శాస్త్రవిహితకర్మల నాచరించుట కవకాశముండదు గాన నాతనికి పుణ్యలోకములు ప్రాప్తింపవు. కర్మల జేయనిదే చిత్తశుద్ధిగలుగదు -జ్ఞానమున కవకాశములేదు. మోక్షము మాటయే యుండదు. ఇట్లే నిర్ధనునకు కామప్రాప్తియు లేదు. తనకే భుక్తిజరుగనిది భార్యకేమి పెట్టును? ఆమెతో నెట్లు భోగించును? కావున ధనము దుష్కృత్యములకు మూలమని యెటుల నిరూపించితివో అటుల సత్కార్యములకు గూడ ధనమే మూలమని గుర్తింపుము. ధనమువలన సంభవించెడి దుష్కార్యములుగాని సత్కర్మలుగాని ఆధనము గల వ్యక్తియొక్క గుణములనుబట్టి జరుగుచుండును, అవి ధనమునకు సహజమైనవి కావు.

**19.** తథా హి- దేశే కాలే పాత్రే చ దత్తం సద్విత్తం సకామం దాతారం స్వర్గం నయతి నిష్కామం చిత్తశుద్ధి జనన ద్వారా మోక్షం నయతి। సన్నిహిత మృత్యుకాలో హి ధనికోఽచిరేణ కాశీం గత్వా తత్ర శివాత్తారకోపదేశం లబ్ధ్వా తత్సేవయా ప్రవృద్ధసత్త్వగుణస్సన్ జ్ఞానం లబ్ధ్వా ముచ్యతే।

ఎట్లన-దేశకాల పాత్రములను గమనించి చేయబడినదానము, దాతకు ఫలాపేక్ష యున్నచో స్వర్గము కలుగజేయును: ఫలాపేక్షలేనియెడల చిత్తశుద్ధి కలిగించి మోక్షకారణమగును. మరణకాలము సమీపించినపుడు ధనవంతుడు కాశికేగి శివుని వలన తారకోపదేశము బడసి ముక్తిగాంచును. మఱియు ధనికుడెంత వెలకల్గినను సాత్త్వికాహారమును భుజించును:తద్వారా సత్త్వగుణము పెంపొంది జ్ఞానము లభించును. క్రమముగా ముక్తుడగును.

**20.** ధనికః స్వం పుష్ణాతి, స్వకుటుమ్బం పుష్ణాతి, అతిథీనభ్యాగతానర్థినశ్చ

**పుష్ణాతి, మిత్రాణాఞ్చోపకురుతే. గురోస్సకాశాద్విద్యాం లబ్ధ్వా దక్షిణాదానేన గురుం తోషయతి 'గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన' వేతి హ్యుక్తమ్!**

ధనికుడు దనను దనకుటుంబమును పోషించును. అతిథుల నభ్యాగతుల బూజించును. మిత్రుల కుపకరించును. గురువులనొద్ద విద్యాభ్యాసమొనర్చి విద్యబడసి గురువును ప్రియమైన దక్షిణయిచ్చి సంతోషపరచును. గురు శుశ్రూష వలనగాని పుష్కలమైన ధనముద్వారాగాని విద్య లభించునని పెద్దలు వచింతురు.

**21. దక్షిణాశయైవ శిష్యాయ గురుశ్శ్రద్ధయా విద్యాముపదిశతీతి విద్యాయా అపి ధనమేవ సాధనమ్। ప్రాప్తౌ భవతి। ధనికశ్చ విద్వాన్ శిష్యేభ్యోఽన్న -దానపూర్వకం విద్యాదానం కరోతి। తస్మాచ్చ దానాద్దాతా స్వర్గం గచ్ఛతి, పరమపదఞ్చ।**

శిష్యుడు ధనికుడైనచో పుష్కలముగా దక్షిణ లభించునను నాశచే గురువుశ్రద్ధతో విద్యనేర్పును. కావున విద్యాప్రాప్తికిని ధనము కారణమగును. విద్వాంసుడు ధనికుడైనచో శిష్యులకు భోజనమిడి విద్యాదానముచేయును. తన్మూలమున దాతకు స్వర్గము అటుపై పరమపదము ప్రాప్తించును.

**22. రాజపురుషా రాజానశ్చ ధనికం సజ్జనం సమ్మానయన్తి విద్వాంసశ్చ ధనికం సేవన్తే। ధనిక ఏవ జ్యోతిష్టోమాది కర్మకరణే శక్నోతి। అనృతమపి ధనికేనోక్తమేవ సర్వే సత్యత్వేన గృహ్ణన్తి। "యస్యాస్తి విత్తం స నరః కులీనః స పణ్డితః స శ్రుతవాన్ గుణజ్ఞః। స ఏవవక్తా స చ దర్శనీయః సర్వే జనాః కాఞ్చన మాశ్రయన్తి" యద్వా "సర్వే గుణాః కాఞ్చనమాశ్రయన్తి" ఇతి భర్తృహరిరప్యువాచ।**

రాజకీయోద్యోగులుగాని రాజుగాని ధనికుని గౌరవింతురు. విద్వాంసులుగూడ ధనికు నాదరింతురు. జ్యోతిష్టోమాది యాగముల ననుష్ఠించుటకును ధనికుడే సమర్థుడు. ధనికుడసత్యము జెప్పినను ప్రజలు దానిని సత్యముగా గ్రహింతురు. ఈ విషయమున నొక మహాకవి యిట్లుచెప్పెను. "ఎవని యొద్ద ధనముండునో అతడుకులముగలవాడు,అతడే పండితుడు శాస్త్రజ్ఞుడు గుణవంతుడు,నతడే వక్త దర్శనీయుడును: ప్రజలందఱు ధనమునే యాశ్రయింతురు."కాదు:"గుణములన్నియు ధనము నాశ్రయించు"నని భర్తృహరి నుడివెను.

**23.** **వాపీకూపతటాకాఽఽరామాఽఽలయాదిసత్కర్మాణి సర్వాణ్యపి ధనైకసాధ్యాని। అన్నదానఞ్చ ధనైక సాధ్యమ్। న చ దరిద్రా అపి భిక్షిత్వా పూర్వోక్తాని కుర్వన్తీతి వాచ్యమ్। భిక్షయాపి తే ధనం లబ్ధ్వైవ కుర్వన్తి, న తల్లబ్ధ్వేతి కృత్వా తత్కర్మ కరణసమయే తే ధనిన ఏవ।**

బావులు, చెరువులు, తోటలు, దేవాలయములు మున్నగు సత్కర్మలన్నియు ధన సాధ్యములు. అన్నదానము కూడా ధనముచేతనే సాధింపదగినది. దరిద్రులు కూడా బిచ్చమెత్తి సత్కార్యములు చేయుటలేదా యందురేమో!వారైననూ ధనము సమకూడిన పిమ్మటనే కదా చేయుట. ఆ సమయమున వారు ధనికులనియే చెప్పవలెను.

**24.** **ధనమేవ గర్భాధానాదిషోడశసంస్కారముఖ్యసాధనం సద్ద్విజత్వం దిశతి। భగవద్భక్తి నిర్వాహకఞ్చ ధనమేవ। ధనినో హి భగవత్కైఙ్కర్యం కర్తుం క్షమన్తే। తీర్థాటనఞ్చ ధనైకసాధ్యమ్। శ్రీరఙ్గనాయకాదిదేవపూజనఞ్చ ధనైక సాధ్యమ్! ధనేన హి దేవార్చకా ధనికస్య వశం యాన్తి। ధనికా హి స్వయఙ్గృహేషు శీతవాతాతపాదినివారకేషు సుఖం వసన్తోఽన్యాంశ్చ సుఖం వాసయన్తి।**

బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ద్విజులని పిలువబడుటకు గర్భాధానము మున్నగు నేషోడశ(16) సంస్కారములు గలవో అవి నెరవేరుటకును ధనమే సాధనము. మఱియు భగవద్భక్తిని నిర్వహించునదియు ధనమే. భగవత్కైంకర్యము చేయుటకు అనగా నానావిధములగు నుత్సవములు జేయుటకు ధనమే కారణము. శ్రీరఙ్గనాయకాదుల నారాధించుటకు ధనమే సాధనము. ధనమూలమున నర్చకులు ధనికునకు వశమగుదురు. అందుచే వారికి స్వామిసేవ చక్కగా లభించును. ధనికులు మంచి కట్టడములగట్టుకొని ఎండకు చలికి గాలికి బాధపడక సుఖముగా వసించుచు నితరులకుగూడ సుఖనివాసము కల్పింతురు.

**25.** **కిఞ్చ యది లోకే ధనవన్తస్సాధవో న స్యుస్తర్హి సన్న్యాసినాం భిక్షాన్నాదిక మపి దుర్లభమేవ। కవయశ్చ ధనినస్స్వకృతవాన్ గ్రన్థాన్ముద్రయిత్వా శాశ్వతా న్విదధతే। ధనాభావేతు ముద్రణాభావాద్గ్రన్థప్రఖ్యాతిరేవ న స్యాత్।**

మఱియు, లోకములో నుదారులగు ధనవంతులు లేనియెడల సన్న్యాసులకు భిక్షకూడ లభింపదు. కవీశ్వరులకు ధనమున్నచో దమగ్రంథములను ముద్రించి శాశ్వత మొనరింతురు. ధనములేనిచో ముద్రణముజరుగక గ్రంథములకు ప్రఖ్యాతి లభింపదు.

**26.** **పూర్వకాలేపి ధనం గృహీత్వైవ లేఖకా గ్రన్థాం స్తాలపత్రేష్వలిఖత్ యః పరోపకారాయ గ్రన్థం లిఖితవాన్ సోపి ధనిక ఏవ। న తు దరిద్రస్య భుక్తి శూన్యత్వేన చిత్తస్థైర్యాద్యయోగాత్। కిమ్బహునా! దేవో పి ధనస్య పృష్ఠే వసతి। "ధనమూలమిదఞ్జగత్"।**

పూర్వకాలమున గ్రంథములను దాటియాకులలో వ్రాసినవారుకూడ ధనము తీసుకొనియే వ్రాసిరి. ఎవ్వడేని ధనము గైకొనక పరోపకారమునకు వ్రాసియుం.ెనా అతడు ధనికుడై యుండును కాని దరిద్రుడై యుండడు. దరిద్రుడైన పక్షమున వేళకు తిండియుండక ఆతనికి చిత్తస్థైర్యముండదు. వేయేల? భగవంతుడుకూడ ధనమునకు వెనుకయుండును. జగత్తు ధనమూలమైయున్నది.

**27.** **యదధనసాధ్యమ్ సత్కర్మ తన్నైవ పశ్యామః। కిఞ్చ ఆత్మారామం విహాయ తదితరసర్వలోకస్య ధనమేవ సుఖప్రదమ్। ధనాభావే సుఖాభావ ఏవ। ధనినః ఖలు ప్రాసాదేషు వసన్తో మృష్టమన్న మశ్నన్తః స్రగ్విణో భూషణవన్త శ్చన్దన కస్తూర్యాదిలేపభాజః పట్టామ్బరధరాః స్వలఙ్కృత సున్దరీభిస్సహ సమ్భోగాదికం కుర్వన్తః స్వయం మధురతరం గాయన్తః పరైశ్చ వైణికై ర్గాపయన్తః ప్రహృష్టైః పుష్టైశ్చ పుత్రమిత్రభృత్యాదిభిః పరివేష్టితా వన్దిమాగధాదికీర్తిత మాత్మసద్యశః శృణ్వన్త స్స్వయం నన్దన్తః పరాంశ్చార్థినో ధనధాన్యాదిప్రదానేన నన్దయన్తః పుత్రపౌత్రాది వివాహాది మహసన్దర్మనేన సముల్లాసినస్సుఖం లభన్తే।**

ధనమున కలవికాని సత్కార్యమొక్కటియులేదు. ఆత్మారాముడగు మహామహునకు దప్ప తక్కినప్రజకంతయు ధనమే సుఖదాయకము. ధనము లేనిది సుఖములేదు. ధనవంతులు మేడలయందు వసించుచు మృష్టాన్నము భుజించుచు పుష్పములను ఆభరణములను ధరించి, చందన కసూర్తికాది లేపములనలంది, జలతారు పట్టుబట్టల గట్టికొని సుందరాంగనలగూడి విహరించుచుందురు. సంతుష్టాన్తరంగు లైన పుత్రమిత్ర బాంధవులు తమ్ము బరివేష్టింప వీణావాదనకుశలులైన గాయకులచే బాడించుచు తాము మధురముగ బాడుచు కాలయాపనము చేయుదురు. స్తోత్ర పాఠకులు దమ యశస్సు గానము చేయుచుండ విని యానందించుచు యాచకులకు ధనధాన్యముల నొసంగి సంతోష పెట్టుచుందురు. మఱియు పుత్రపౌత్రాదుల వివాహాదికార్యములు మహావైభవముగ జరుగుచుండ వానిని జూచి యానందపడుచు సుఖముగ జీవింతురు.

**28. యే పునర్లుబ్ధాస్స్వయమనశ్నన్తః పరేభ్యఃకిమపి న దదతి తే ధనికాభాసా దరిద్రా ఏవ।**

**శ్లో॥ ధనినోఽప్యదానవిభవా గణ్యన్తేధురిమహాదరిద్రాణామ్।**
**హన్తి న యతః పిపాసామతస్సముద్రోపి మరురేవ॥ ఇతి వచనాత్.**

**"యద్దదాతి యదశ్నాతి త దేవ ధనినాం ధనమ్" "దానోపభోగరహితం విఫలం ధనం య" దితి వ్యర్థధనా లుబ్ధా దరిద్రా ఏవ। అయఞ్చ లోభో న ధనగతో దోషః కిన్తు పురుషగత ఏవ।**

ఎవరు ధనికులయ్యు తాముదినక యొరులకు బెట్టకయుందురో అట్టివారు ధనికులవలె కన్పడు దరిద్రులని చెప్పవలెను. వీటిని గూర్చి యొక కవి యిట్లు నుడివెను. "దేనిని దానము చేయుదురో దేని ననుభవింతురో అదియే ధనికుల యొక్క ధనము, దానము అనుభవములేని, ధనము నిష్ఫలమైనది. ఇట్టి విషయమైన ధనముగల పీనాసివారు దరిద్రులే. ఈ పిసినిగొట్టుతనము ధనమునకు చెందిన దోషము కాదు. ధనాశ్రయమైన వ్యక్తికి జెందినది.

**29. దరిద్రాశ్చ తరుమూలేషు వసన్తః వాతాతపాదిప్రపీడితాః। జఠరాగ్నిదగ్ధాః క్షుత్ క్షామ శిశు ప్రపీడితాః, దారాన్ ద్రష్టుమప్యనుత్సహమానాః, పితృమాతృ దారాభిరనవరతం శప్యమానాః విధిం నిన్ద్య న్తస్స్వయం రుదన్తః, అన్యాంశ్చ రోదయన్తః క్షుద్వారణాయ పాపాని కుర్వన్తి। తదుక్తమ్।**

**శ్లో॥ అదానదోషేణ భవేద్దరిద్రో దరిద్రదోషేణ కరోతి పాపమ్।**
**పాపాదవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః పునరేవ పాపీ॥ ఇతి।**

**తస్మాద్ధనినో లుబ్ధా జన్మాన్తరే దరిద్రా ఏవ భవేయుః।"ద్వారం ద్వారమటన్ భిక్షుశ్శిక్షత్యేవ న యాచతే। అదత్వా మాదృశో మాభూర్దత్వా త్వం త్వాదృశో భవ। ఇతి వచనాత్।**

*దరిద్రులన్ననో–చెట్టుక్రింద కాపురము చేయుచు చలికి ఎండకు గాలికి బాధపడుచు జఠరాగ్నిచే దహింపబడుచు, ఆకలి బాధచే నలమటించు శిశువు లేడ్పించుచుండ భార్యను చూచుటకైన మనసొప్పక తల్లిదండ్రులచే భార్యచే దిట్టుదినుచు దైవమును దూషించుచు నేడ్చుచున్నవారై చూచినవారల నేడ్పించుచు నాకలి బాధను బోగొట్టు కొనుటకై పాపముల జేయుచుందురు. ఈవిషయమున నొక మహాకవి వాక్యమును*

జూతము. "ధనికుడు దానము చేయని దోషమువలన దరిద్రుడై జన్మించును. దారిద్ర్యదోషమువలన పాపము చేయును. పాపముచే నరకమున కేగును. మరలదరిద్రుడై మరల పాపియగు చుండును." కావున లుబ్ధులైనధనికులు మరుజన్మమున దరిద్రులే యగుదురు. ఈ విషయమును బోధించుటకై యొక మహాకవి శివునిగూర్చి యిట్లు వర్ణించెను. "శివుడు కపాలమును ధరించి యిల్లిల్లుతిరుగుట యాచించుటకుగాదు. ధనికులకొక మహత్తరసందేశమును బోధించుటకై యాతడిట్లు తిరుగుచున్నాడు ఏమన-ఓ ధనికా! నీవు లుబ్ధుడ వై యాచకులను చిన్నబుచ్చిన యెడల మరుజన్మమున నావలె భిక్షాపాత్రము ధరింపగలవు. అటుల దుర్గతి జెందకుము. ఈజన్మమున దానముచేసి మరల నీవలె ధనికుడవై జన్మింపుము!

**30.** న చైవం 'పాపకారిణో దరిద్రస్య యమశిక్షైవ। కిన్తు రాజశిక్షాపి చౌర్యాదివశాద్భవతి, నాయం ధనదోష ఇతి భ్రమితవ్యమ్, కిన్తు ధనాభావదోష ఏవ।

పాపకృత్యము లొనర్చు దరిద్రునకు మరణించినపిదప యమశిక్ష యొక్కటియే కాదు. బ్రతికియుండగా ఏదొంగతనమునకో పట్టుబడి కారాగారశిక్ష కూడా ననుభవింపవలసియుండును. ఇది ధనదోషమని పొరబడుదురేమో, ఎన్నిటికినీ కాదు. ధనము లేనందువలన వాటిల్లెడి దోషమని గ్రహింపవలెను.

**31.** కిఞ్చాయం దరిద్రః-

"మత్కుణా మశకా రాత్రౌ మక్షికా యాచకా దివా।
పిపీలికా చ భార్యా చ దివారాత్రౌ చ బాధతే॥

ఇతి యాచకస్సన్పరానత్యన్తం బాధతే। తైశ్చాధిక్షిప్యతే। ధిఙ్మామితి స్వజీవితే నిన్దాం ధత్తే। తతో వాప్యాదిపతనేనాత్మహత్యాం చ తనుతే। తస్మాచ్చాత్మ-హత్యాదోషాదన్ధం తమః ప్రపద్యతే।

మఱియు దరిద్రుడెల్లపుడు పరులను మిక్కిలి బాధించుచుండును. "నల్లులు దోమలు రాత్రియందును, ఈగలు యాచకులు (దరిద్రులు) పగటియందును బాధింతురు. చీమయు భార్యయు రాత్రింబవళ్లు బాధింతురు" అని యొక కవి వర్ణించెను. ఇందు దరిద్రుడీగలతో బోల్చబడెను. ఇతడు యాచన కేగినపుడు యజమానులచే ధిక్కరింపబడును. పిమ్మట-"ఛీ ఛీ పాడుజీవితమును" అని తనజీవితమును

నిందించుకొనును. అటుపై యేబావియందో పడి యాత్మహత్య జేసికొనుటయు కలదు. ఆత్మహత్యాదోషమువలన నంధకారమయమగు నరకము పాలగును.

**32. అపి చ దరిద్రః భిక్షాలబ్ధపూతిగన్ధాన్నాదినా శరీరపోషం కుర్వన్ తమోగుణమయో భవతి। అతఏవ వివేకశూన్యః పశుతుల్యో భవతి। అస్య దరిద్రస్య ద్విపాత్పశోః నేహసౌఖ్యం, న పరసౌఖ్యం, నాపి మోక్షః।**

*మఱియు దరిద్రుడు బిచ్చమునకు దొరకిన దుర్గంధాన్నము పాసిన కూరలు మున్నగు వానితో కడపు నింపుకొనుటచే తమోగుణము వృద్ధిజెందును. అంతట వివేకము నశించి పశుతుల్యుడగును. ఇట్టి ద్విపాత్పశుప్రాయుడగు దరిద్రున కిహలోకసౌఖ్యము గాని పరలోకసౌఖ్యముగాని మోక్షముగాని లభింపదు.*

**33. యద్యపి దరిద్రః పర్వతకన్దరే స్థిత్వా వాతామ్బు పర్ణాశనో నిరాహారో వా భూత్వా లంబికాయోగం నిర్వికల్పసమాధిం వా ప్రాప్య జీవన్ముక్తి సౌఖ్యం ప్రారబ్ధావసానే కైవల్యం చ ప్రాప్తుం శక్నోతి, తథాపి న తాదృశాః కలియుగే నన్తీతి బోధ్యమ్। తస్మాత్కలియుగే సర్వేషాం జనానాం గుణానాఞ్చ ధనమేవాశ్రయః।**

*దరిద్రుడైనను నింద్యజీవితముగడుపక పర్వతగుహలలో వసించి ఆకులలముల దినుచు క్రమముగా నిరాహారుడై లంబికాయోగమును గాని నిర్వికల్పకసమాధినిగాని యవలంబించి జీవన్ముక్తిసౌఖ్యము ననుభవించుచు దేహావసానమున ముక్తి చెందవచ్చును. కాని యిట్టిమహనీయులు కలికాలమున నుందరు. కావున కలియుగమున సర్వజనులకు సమస్తగుణములకు ధనమే యాధారమని గ్రహింప వలెను.*

**34. బహుభాషీ ధనికో వాచాల ఇతి గీయతే। దరిద్రస్తు వాచాట ఇతి విగీయతే। అల్పభాషీ ధనికో మితభాషీతి గీయతే। దరిద్రస్తు గర్విత ఇతి విగీయతే। అభాషీ ధనికో మునిరితి గీయతే। దరిద్రస్తు మూక ఇతి విగీయతే। బహ్వన్నభుగ్ధనికో మృష్టాశీతి గీయతే। దరిద్రస్తు అశనఘాతుక ఇతి విగీయతే।**

*ధనికుడధికముగా మాటాడుచో "మాటకారి" యని కీర్తింపబడును. దరిద్రుడు మాటాడిన "వదరుబోతు" అని నిందింపబడును. ధనికుడు దక్కువగా మాటాడిన "మితభాషి" యందురు. దరిద్రుడు "గర్వపోతు" అని దూషింపబడును. ధనికుడు*

మాటాడనియెడల"మౌనవ్రతి" యందురు. దరిద్రుడు మూగవాడని పరిహసింపబడును. అధికముగా భుజించు ధనికుడు "మృష్టాన్నభోజి" యని స్తుతింపబడును. దరిద్రు "దశనిఘాతుకు" దని దూషింపబడును.

**35. దీర్ఘవరాజ్గో ధనికః పాఞ్చాలజాతిపురుష ఇతి గీయతే, దరిద్రస్తు ఖర ఇతి విగీయతే। బహుధారో ధనికః కృష్ణ ఇతి గీయతే, దరిద్రస్తు శ్వేతి విగీయతే। బహుపుత్రా ధనికపత్నీ మహాభాగేతి గీయతే, దరిద్రపత్నీతు సూకరీతి విగీయతే।**

ఎత్తరియైన ధనికుడు "పాంచాలజాతిపురుష"దని కొనియాడబడును. దరిద్రుని "గాడిద" యని నిందింతురు. ధనికుడు వ్యభిచారియైన "కృష్ణు" దని కీర్తింపబడును. దరిద్రుడు"కుక్క"యని దూషింపబడును. బహుసంతతిగల ధనికురాలు భాగ్యశాలి యని పిలువబడును. దరిద్రురాలు "పందివలెకనినది"యని దూషింపబడును.

**36. విరూపమపి ధనికపుత్రం సర్వే లాలయన్తి। సురూపమపి దరిద్రపుత్రం న కోపి లాలయతి- ప్రత్యుతాధిక్షిపతి। రూపవాన్ధనికో "యత్రాకృతిస్తత్ర గుణావస" స్తీతి గీయతే, దరిద్రస్తు"విగ్రహపుష్టిర్నైవేద్యనష్టి" రితి విగీయతే।**

ధనికునిబిడ్డ కురూపియైనను నందఱు ముద్దాడుదురు. దరిద్రపుత్రుడు రూపసియైనను గండ్లజూదరు: మీదుమిక్కిలి వంకలుపెట్టుదురు. అందగాడైన ధనికునిజూచి "రూపమున్న తావుననే గుణములుండు" నని కొనియాడుదురు. దరిద్రు డందగాడైనచో "విగ్రహపుష్టి నైవేద్యనష్టి" యని వెక్కిరింతురు.

**37. విద్యావాన్ధనికో యద్యద్వదతి తత్తదేద ఏవ। దరిద్రస్తు యద్యద్వదతి తత్తదనృతమేవ। ధనికస్య యాచ్ఞాపి పుణ్యకృదయమితి కీర్తికర్యేవ। దరిద్రస్య తు జీవనార్థేయమస్య యాచ్ఞేతి లాఘవకరీ। ధనిక దేహగతాని కూట కనకాభరణాన్యపి కనకాభరణాన్యేవ। దరిద్రదేహగతాని కనకాభరణాన్యపి కూటకనకాభరణాన్యేవ।**

విద్యావంతుడైన ధనికుడు పలుకునదంతయు వేదమే. దరిద్రుడేది చెప్పినను అది యసత్యమే యందురు. ధనికుడు యాచించిన పుణ్యకార్యధురంధరు డందురు. దరిద్రుడర్థించిన "జీవనమునకై యిదియొకపన్ను గద" యని తూలనాడుదురు. ధనికుడు ధరించినవి మాయబంగరుసొమ్ములైనను పదాఱువన్నె బంగార మందురు. దరిద్రుడు కనకాభరణములు ధరించినను కాకిబంగారమందురు.

**38.** ధనవాన్యదివేశ్యాం సఙ్గచ్ఛేత్తర్హి కలాశాస్త్రాభిజ్ఞోయమితి గీయతే। యది దరిద్రస్తాంగచ్ఛేత్తర్హి వేశ్యాగామీ పతితోఽయమితి విగీయతే। ధనికస్య ద్విజస్య నర్తనం లీలా, దరిద్రస్య తు నర్తనాన్నటోఽయ మపాఙ్క్తేయ ఇతి గర్హణమ్।

ధనవంతుడు వేశ్యాసక్తుడైనయెడల కామశాస్త్రరతుడని కొనియాడుదురు. దరిద్రుడాపనిజేసిన వేశ్యాలంపటుడు పతితుడని దూషింతురు. ధనికుడగు ద్విజుడు నాటకములలో జేరి వేషముకట్టిన విలాసపురుషుడని కీర్తింతురు. దరిద్రుడైనచో వేషగాడు కులముచెడినవాడని దూషింతురు.

**39.** కిమ్బహునా!-

"గుణాయన్తే దోషాస్సుజనవదనే దుర్జనముఖే గుణా దోషాయన్తే ద్వయమిద మభూద్విస్మయపదమ్। మహామేఘః క్షారం పిబతి కురుతే వారిమధురం ఫణీపీత్వా క్షీరం వమతి గరళం దుస్సహతరమ్"ఇతివత్ దోషా అపి ధనికమాశ్రిత్య గుణాభవన్తి। గుణాఅపి దరిద్రమాశ్రిత్య దోషాభవన్తి। అహో దారిద్ర్యస్య దౌరాత్మ్యమ్! యత్స్వయం దుష్టం సత్ స్వాశ్రయానన్యాంశ్చ దూషయతి।

ఎంతయని చెప్పుదుము? "సత్పురుషుని నోటిలోబడిన దోషములుగూడ గుణములగును. దుష్టునినోటిలోబడిన గుణములును దోషములగును ఎట్లన- మేఘము సముద్రములోని యుప్పునీటినిద్రావి మధురోదకము వర్షించుచున్నది. సర్పము పాలుద్రావియు దుర్భరమగు విషము గ్రక్కుచున్నది అని యొక మహాకవి చెప్పినటుల ధనికునికడనున్న దోషములు గుణములగును. దరిద్రునిజేరిన గుణములుగూడ దోషములుగ గోచరించును. అహో దారిద్ర్య మెంత పాపిష్ఠమైనది! తానుదుష్టమగుట యేగాక తన్నాశ్రయించిన వారిని గూడ దుష్టుల జేయుచున్నది.

**40.** నను ధనస్యేవ దారిద్ర్యస్యాపి దుష్టత్వశిష్టత్వే స్వాశ్రయపురుషగతదుష్టత్వ శిష్టత్వప్రయుక్తే ఏవ। దరిద్రోఽపి హి సత్పురుషః ప్రభూతగుణవానేవ- తథాహి:- దరిద్రో హి శిష్టః ప్రాణాపదమాపన్నోపి న చౌర్యం కరోతి। కిన్తు భిక్షాటనేనైవ జీవతి। మదాభావాన్న పరానధిక్షిపతి। సర్వమాత్మవన్మన్యతే। యథాశక్తి నివాసజలాన్నదానాదినాఽతిథ్యాదీం స్తర్పయతి। సదాపి భగవన్తం భజత ఇతి చేన్మైవమ్ వాదీః। సర్వామపి గుణరాశిమేకో దారిద్ర్యదోషో

**నాశయత్యేవ, మూత్రబిన్దురేకః పయోరాశిమివ। "దారిద్ర్యదోషో గుణరాశినాశీ" తి వచనాత్।**

*ధనమువలనజరుగు మంచిచెడ్డలకు ధనముకారణము గాదనియు అధనమెవరియొద్ద నుండునో ఆవ్యక్తి యొక్క గుణములు కారణమనియు వచించితిరి. అట్టులనే దారిద్ర్యమువలన సంభవించెడి మంచి చెడుగులకుగూడ ఆవ్యక్తియే కారణముగాని దారిద్ర్యముకాదు. సహజముగా సత్పురుషుడైనవాడు దరిద్రుడైనను గుణవంతుడు గనే యుండును. ఎట్లన- సదాచారసంపన్నుడైన దరిద్రుడు ప్రాణాపాయస్థితి వచ్చినను దొంగతనము జేయదు: బిచ్చమెత్తి జీవించును. అహంకారముండదుగాన నతడితరుల నాక్షేపింపడు. అందఱును తన వంటి వారేయని తలచును. తనకున్న దానిలో నతిథులకన్నోదకములను నివాసమును నొసగి వారిని తృప్తిపరుచును. మఱియు నెల్లవేళల భగవంతుని భుజించుచుండును. కావున నిందు దారిద్ర్య దోషమేమి కలదందురా? వినుడు-దారిద్ర్యదోషము సుగుణసంపదను నశింప జేయునని పెద్దలు చెప్పుదురు. ఒక్క మూత్రబిందువు క్షీరభాండమును జెడగొట్టు నటుల నెన్నిసుగుణములున్నను దారిద్ర్యదోషము వానిని మట్టుబెట్టును.*

**41. స్వయమేవ నిర్గృహః పరమదరిద్రశ్శిష్టోపి కథమన్యస్మై నివాసం దద్యాత్? స్వయమేవ యామత్రయాదూర్ధ్వం భిక్షితమన్నమదన్ పరమదరిద్రః కథ మతిథ్యాదీం స్తర్పయేత్?తస్మాద్దుష్టమేవ దారిద్ర్యమ్।**

*ఒకడు సదాచార సంపన్నుడే యగుగాక! అతడు పరమదరిద్రుడైన దనకే గృహ ముండదు. ఇక నితరులకు నివాసమెట్లు కలుగజేయును? మూడుజాముల వేళ బిచ్చపుమెతుకులు దినువాడతిథుల దృప్తిపరుచుటెట్లు? కావున దారిద్ర్యము కడుంగడు చెడ్డది యనుటలో సందియములేదు.*

**42. ఇదమత్ర బోధ్యమ్।"ఏకా భార్యా సున్దరీ వా దరీ వా" ఇతి వచనాత్ ధనవాన్పుమాన్-గృహస్థాశ్రమం స్వీకృత్య ప్రచ్ఛన్దవనితాదిసౌఖ్యమనుభవన్, యజ్ఞయాగాది సత్కర్మాణి గృహదానాన్నదానకన్యాదానాదిసద్దానాని చ కుర్వన్ భగవన్తం భజమానో రాజయోగీ భూత్వా సద్విద్యామధిగత్యైహసౌఖ్యమనుభవన్ పరమపదాసక్తచేతా వర్తేత।**

*సారంశ మెద్దియన- ధనవంతుడు యథావిధిగ గృహస్థాశ్రమము స్వీకరించి చందన తాంబూలాదిసహితముగ భార్యతో గ్రీడించుచు యజ్ఞయాగాదిసత్కర్మల నాచరించుచు*

గృహదానము అన్నదానము కన్యాదానము మున్నగు సద్దానముల జేయుచు భగవదారాధనగావించుచు రాజయోగియై సద్విద్యనార్జించి యిహసౌఖ్య మను -భవించుచు మోక్షాసక్తుడై యుండవలెను. "సుందరాంగనయో-పర్వతగుహాయో ఇందొక్కటి ప్రియురాలై యుండవలె" నని యొకమహనీయుడు వచించెను.

**43. దరిద్రస్తు-సర్వం పరిత్యజ్య కామపి దరీమాశ్రిత్య హఠయోగీ భూత్వా యోగానన్దమనుభవన్నాత్మనిష్ఠో వర్తేత - ఇతి మార్గద్వయం సువ్యవస్థితమ్।**

ఇక దరిద్రుడన్ననో- సర్వమును బరిత్యజించి యొక పర్వతగుహాయందు జేరి హఠయోగము నభ్యసించి యోగానన్దమనుభవించుచు నాత్మనిష్ఠుడై యుండవలెను. ఇటుల రెండు మార్గములు పెద్దలచే ధృఢముగా జెప్పబడినవి.

**44. యః పునర్ధనమదాన్ధః యశ్చ దరిద్రస్సంసారీ తావుభౌ నేహసౌఖ్యం నాపి పరసౌఖ్యం మోక్షసౌఖ్యం ప్రాప్నుయాతామ్। తస్మాత్ఖలస్యధన-మయోగినో దారిద్ర్యఞ్చ విషమేవ। సాధోస్తు ధనమమృతమ్। యోగినో దారిద్ర్యఞ్చామృత మేవ।**

పై మార్గములననుసరింపక ఏధనికుడు ధనమదాంధుడై వర్తించునో:ఎవడు దరిద్రుడయ్యు సంసారమున జిక్కు కొనునో:వీరికి నిహసౌఖ్యము గాని పరలోక సుఖముగాని మోక్షముగాని ప్రాప్తించదు. కావున దుష్టునకు ధనము యోగభాస్యము లేని వానికి దారిద్ర్యము ఈరెండును విషప్రాయములు. సజ్జనునకు ధనము, యోగికి దారిద్ర్యము అమృతప్రాయములు.

**45. న చాకిఞ్చన ఏవ సాధుర్న ధనిక ఇతి వాచ్యమ్। యస్య ధనికస్య గర్వాహఙ్కారాదికం కిఞ్చనాపి నా స్తి స ఏవా కిఞ్చనః,న తు శుష్కదరిద్రః। యద్యప్యేనం ధనం బహుగుణమ్, తథాపి న ధనలోభేన దుష్టకర్మాణి కుర్యాత్। దుష్టకర్మాచరణస్య పాతిత్యావహత్వాత్।**

దరిద్రుడైనవాడే సత్పురుషుడగునుగాని ధనికుడెన్నడు సత్పురుషుడు కానేరడని తలంతురేమో: అది కల్ల. ధనమున్నను గర్వము బొత్తుగా లేని యెడల నత డకించనునివలె వినయాదిగుణాన్వితుడై యుండును. అంతయే కాని గుణవంతుడు శుష్కదరిద్రుడై యుండవలెనని యనుకొనరాదు. పై దెల్పినరీతిగా దర్కించిన ధనములో నెన్నియో సుగుణములు గానవచ్చుచున్నవి. ఐనను ధనార్జనమునకై

దుష్కార్యముల జేయరాదు. దుష్కృత్యములు నరుని పతితునొనర్చును.

**46. కిన్తు విహితయైవ వృత్త్యా ధనమార్జయే దార్జితఞ్చ ధనం దేశే కాలే పాత్రే చ దద్యాత్। ఏష హి ధర్మః పరమః। "ఇజ్యాధ్యయనదానాని పావనాని మనీషిణామ్" ఇతి వచనాత్। ఏతాని త్రీణ్యపి హి ధనసాధ్యాని। తస్మాద్ధనం నావమన్యేత। తచ్చధనం లక్ష్మీకటాక్షం వినా న లభ్యతే। నాపి వర్ధతే। నాప్యక్షయ్య మ్భవతీతి ధనకామినా లక్ష్మీర్భజనీయా।**

శాస్త్రముచేత దనకువిధింపబడిన వృత్తినవలంబించి ధనార్జనము చేయవలెను. ఆర్జించినధనము దేశకాలపాత్రముల గమనించి దానము చేయవలెను. ఇది మానవునకు బరమ ధర్మము. యజ్ఞము అధ్యయనము దానము ఇవి మానవుని బవిత్రునిజేయునని శాస్త్రము తెల్పుచున్నది. వీనినాచరించుటకు ధన మావశ్యకము. కావున ధనమును నిందింపరాదు. అట్టి ధనము లక్ష్మీకటాక్షము లేనిదే లభింపదు, వృద్ధిజెందదు: తరిగినది పూర్తికాదు. కావున ధనకాంక్షగలవాడు లక్ష్మీదేవినారాధింపవలెను.

**47. "యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వం పురుషానహమ్। అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే" ఇతి శ్రీసూక్తాత్. స చ లక్ష్మీభజనప్రకారః శ్రీసూక్త భాష్యే స్ఫుట ఏవ। "యద్ద్వారే మత్తమాతఙ్గా వాయువేగా స్తురఙ్గమాః। పూర్ణేన్దువదనా నార్యశ్శివపూజా విధేః ఫలమితి వచనాదైశ్వర్యార్థినా శివపూజా విధేయేతి కేచిత్।**

సువర్ణము గోవులు అశ్వములు మున్నగుసంపదబడయుటకును, దారిద్ర్యము తొలగుటకును లక్ష్మీదేవిని గురించిన ప్రార్థనము శ్రీసూక్తమున గానబడుచున్నది. లక్ష్మీపూజా విధానము శ్రీసూక్తభాష్యమున వ్రాయబడియున్నది. శివపూజ వలన నైశ్వర్యము సిద్ధించునని కొందఱు వచింతురు. "మదించిన గజములు వాయు వేగముగల గుఱ్ఱములు పూర్ణచంద్రముఖులగు నారీమణులు నెవని వాకిట నుందురో అది శివారాధనకు ఫలితమని పురాణములు వెల్లడించుచున్నవి.

**48. లక్ష్మ్యాశ్శివస్య వేశ్వరావతారత్వాత్సర్వథాపీశ్వర భజనమేవ కర్తవ్యమ్। న హీశ్వరమ్భజమానస్య దుర్లభం నామ! న చ మోక్షార్థమేవేశ్వరో భజ్యతా కిమితి ధనార్థమితి వాచ్యమ్। ధనస్యాపి పరమ్పరయా మోక్షహేతుత్వస్యోక్తత్వాత్।**

ధనేనైవ లోకయాత్రా నిర్వహణాచ్చ।

లక్ష్మీదేవి కానిండు శివుడేకానిండు అందఱియందును దైవతత్త్వము సమానముగాన నేరీతిగనైన దైవమునారాధింపవలెను. ఈశ్వరుని భజించువారికి లభింపని దెద్దియు లేదు. మోక్షార్థియైనపు డీశ్వరునిభజించుట యుక్తముగాని ధనార్థమై యీశ్వరారాధన యుక్తము కాదని కొందఱు వాదింతురు. ఇది యసమంజసము. ఏలయన ధనముగూడ క్రమముగ ముక్తి హేతువగుచున్నది:మఱియు జీవయాత్రకు ప్రధాన హేతువు ధనమే యగుచున్నది కాన ధనార్థమై భగవదారాధన కూడ మోక్షహేతు వగుచున్నటుల పూర్వమే నిరూపింపబడినది.

**49.** ఇహజన్మని జన్మాన్తరే వా తోషితేశ్వరానుగ్రహాద్ధనం లబ్ధ్వా తు న గర్వాహఙ్కారాదికం ప్రాప్నుయాత్। ఇదమేవ మహత్తరం కష్టమ్, యద్ధనే సత్యనౌద్ధత్యమ్। అత్రైవ పురుషకారస్సర్వోప్యుపయోక్తవ్యః। సత్యాన్తు వినయాదిగుణసమ్పత్తౌ నాస్తి ధనేన తుల్యం కిఞ్చిద్వస్తు భువనే పురుషార్థప్రదం పురుషస్య।

ఇతి బెల్లంకొండోపనామక రామకవికృతం ధ న వ ర్ణ న మ్।
శ్రీహయగ్రీవార్పణమస్తు. పరీధావి చైత్రశుద్ధాష్టమీ।

ఈజన్మమునగాని పూర్వజన్మములందుగాని తానొనర్చిన యీశ్వరారాధనచే లభించిన ధనమునుబట్టి మానవుడహంకారముజెందరాదు. ధనము లభించియు గర్వము స్పృశింపకుండుట చాలగొప్ప విషయము. మానవుని మనోబలమంతయు నీవిషయమున వినియోగింపదగియున్నది. వినయము మున్నగు గుణము లుండెనేని యాతనికి ధనముతో సమానమగు మఱియొక వస్తువులేదు. అదియే సకల పురుషార్థముల సాధించుటకుపకరించును.

శ్రీః

శ్రీః

ఓం శ్రీ హయగ్రీవాయ నమః

# కామమీమాంసా

**1. ధర్మార్థకామా ఇతి త్రయః పురుషార్థాస్త్రివర్గ ఇతి వ్యవహ్రియన్తే। తత్ర ధర్మార్థావుపవర్ణితౌ। కామ ఇదానీముపవర్ణ్యతే।**

ధర్మము అర్థము కామము అనియెడు మూడు పురుషార్థములకు "త్రివర్గ" మని పేరు. అందు ధర్మార్థములను గూర్చి చర్చించితిని. ఈప్రకరణమున కామమును గూర్చి విమర్శించెదను.

**2. నను కోఽసౌ కామః? కామః "పఞ్చశరస్స్మర" ఇత్యభిధానసిద్ధో మన్మథ? మైవం వాదీః। మన్మథస్యాపురుషార్థత్వాత్। కామస్య చ తృతీయ పురుషార్థత్వాత్।**

కామమనగా నేమి? "కామః పఞ్చశరస్స్మరః" అని యమరనిఘంటువులో నున్నందున కామ శబ్దమునకు మన్మథుడని యర్థము చెప్పుదమా? ఇది అయుక్తము. ఏలయన-మన్మథుడు పురుషార్థములలో జేరడు. మనము చర్చించునది పురుషార్థ విషయము గాన మన్మథునితో సంబంధము లేదు.

**3. న చ మన్మథోఽపి పురుషార్థ ఏవ। పురుషైర్మన్మథస్యార్థ్య మానత్వాదితి వాచ్యమ్। తథాసతి శివవిష్ణ్వాదీనామపి పురుషార్థత్వాపత్తేః।**

పురుషులు అర్థించునది (ప్రార్థించునది) పురుషార్థము కదా! కొందఱు పురుషులు మన్మథుని గూడ తమ యభీష్టసిద్ధికై ప్రార్థింతురు. కావున నాతడే మూడవ పురుషార్థమని యేల గడింపరాదు? అని ప్రశ్నింతురు. ఇది యుక్తము కాదు. కొందఱు శివుని, కొందఱు విష్ణుని, మఱికొందఱు గణపతిని ప్రార్థించు చుందురు. వారందఱు పురుషార్థములే కావలసివచ్చును. ఇన్ని పురుషార్థములు లేవు.

**4. కస్తర్హి పురుషార్థపదార్థః? యః పురుషేణ భోక్తుం ప్రార్థ్యతే సః పురుషోప -భోగ్య ఇత్యర్థః।**

పురుషార్థమన నెద్దియో కనుగొందము. "పురుషుడు తా ననుభవించుటకై దేనిని ప్రార్థించునో (కోరునో) అయ్యది పురుషార్థము." అనగా పురుషునిచే ననుభవింప దగినది యని యర్థము.

**5. నచైవం నార్యుపభోగ్యస్యాపురుషార్థత్వమాగతమితి వాచ్యం, పురుషశబ్దస్య జీవవాచిత్వాత్,జీవో హి పురి శరీరే శయనాత్పురుష ఇతి భవతి పృషోదరాదిత్వా ద్రూపసిద్ధిః, పృషోదరాదీని యథోపదిష్టమితి హ్యనుశాసనమ్।**

ప్ర:- స్త్రీ అనుభవింపదగినది పురుషార్థముకాదా?

ఉ:- అదియు పురుషార్థమే. ఇచ్చట "పురుష" శబ్దమునకు జీవుడని యర్థము। ఎట్లన- "పురి-శయ" పదములు కలిసి "పురుష" శబ్దమైనవి. పురి=శరీరమందు, శయ=నివసించువాడు,అనగా జీవుడని యర్థము.

ప్ర:- "పురి-శయ" అనునది "పురుష" పదమెట్లయినది?

ఉ:- "పృషత్-ఉదర" అను పదములు చేరి "పృషదుదర" అని కావలసి యుండ "పృషోదర" అని వ్యాకరణశాస్త్రము వ్రాయబడెను. ఇట్టి శబ్దములు పెక్కుగలవు. వానిలో "పురుష" పదముకూడ చేరియున్నది. ఇట్టి మార్పులను ఉచ్చారణ సౌకర్యమునకై మహర్షులే చేసియుంచిరి. ఆపదములను వారు నిర్ణయించినట్లే పలుక వలెననియు వారే శాసనము చేసియున్నారు. పురుషుడనగా జీవుడు.

**6. హన్త తర్హి జీవైః రత్యాదిభిర్మన్మథ ఉపభుజ్యత ఇతి స్త్ర్యన్త రైస్సున్దరతయా ప్రార్థ్యత ఉపభోగాయేతి చ పురుషార్థ ఏవేతి చేన్నైవమ్। స్త్రీపురుషసాధారణోప భోగ్యస్యైవ పురుషార్థత్వాత్। నను పురుషాశ్చ మన్మథం భజమానా మన్మథ సాయుజ్యం ప్రాప్నువన్తీతి పురుషైరపి మన్మథః ప్రాప్యత ఇతి చేన్నైవమ్। తథాసతి శివవిష్ణ్వాదీనామపి పురుషార్థత్వాపత్తేః। మన్మథాది భక్తానాం మన్మథాది సాయుజ్యాయోగాచ్చ। మన్మథాది భక్తాః ఖలు మన్మథాదిసాలోక్యసారూప్య సామీప్యాని భజన్తే। బ్రహ్మవిదేక ఏవ బ్రహ్మసాయుజ్యం ప్రాప్నోతి బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతీతి శ్రుతేః।**

ప్ర:- జీవులెల్లఱు కామసుఖముచే మన్మథుని అనుభవించుచునే యున్నారు. అతడు దివ్యసుందరవిగ్రహముగాన నాతని ననుభవించుటకు స్త్రీలు ప్రార్థించు చుందురు. కావున మన్మథుడు పురుషార్థమేల కాగూడదు?

ఉ:- స్త్రీపురుషులెల్లఱు నేకరూపముగ ననుభవింపదగిన విషయమే పురుషార్థమగును. కాన మన్మథుడు కాజాలడు

ప్ర:- పోనిండు పురుషులు మన్మథుని నారాధించి ఆతని సాయుజ్యము పొందుదురు గాన నతడు పురుషార్థమనరాదా?

ఉ:- ఒక్క మన్మథునేకాదు. శివుడు-విష్ణువు-గణపతి మున్నగు పెక్కు దేవతల నారాధించుట కలదు. కావున వారందఱు పురుషార్థములనియే చెప్పవలెను. అది కుదరదు. మఱియు మన్మథభక్తులు మన్మథుని సాయుజ్యము జెందుటయు జరుగదు. ఇట్లే ఏ దేవతనారాధించినను నాతని సాయుజ్యము లభింపదు. ఆయా దేవతల సాలోక్యమో-సారూప్యమో-సామీప్యమో లభించును. ఒక్క బ్రహ్మవేత్తకు మాత్రమే బ్రహ్మసాయుజ్యము ప్రాప్తించును. బ్రహ్మవేత్త బ్రహ్మమే యగునని శ్రుతి తెల్పుచున్నది.

| | | |
|---|---|---|
| సాలోక్యము | = | అతని లోకము ప్రాప్తించుట |
| సారూప్యము | = | అతనివంటి రూపము లభించుట |
| సామీప్యము | = | అతని సమీపము జేరుట |
| సాయుజ్యము | = | అతనితో నేకీభవించుట |

**7. నను స విష్ణురేవ భవతీతి శ్రుతేః విష్ణుసాయుజ్యం భవత్యేవేతి చేత్తత్ర బ్రహ్మవాచ్యేవ విష్ణుశబ్దః వ్యాపకత్వాభిధాయకత్వాత్। వ్యాపకం హి బ్రహ్మ। నను కస్మాత్కారణాన్మన్మథాది సాయుజ్యం జీవానాం న స్యాదితిచేదుచ్యతే। జీవస్య హ్యుపాధినాశం వినా న సాయుజ్యలాభః నష్టే తూపాధౌ జీవో బ్రహ్మైవ భవేదితి కథమ్మన్మథాది సాయుజ్యావకాశః।**

ప్ర:- "అతడు విష్ణువే యగును" అని తెల్పునొక శ్రుతి కలదు। దానింబట్టి విష్ణుభక్తునకు విష్ణుసాయుజ్యమున్నది కదా!

ఉ:- ఓయీ! అచటి విష్ణుపదమునకు బ్రహ్మమనియే యర్థము। విష్ణుపదము "వ్యాపించినది" అను నర్థముదెల్పును సర్వవ్యాపకమైనది బ్రహ్మ మొక్కటియే।

ప్ర:- అగుగాక! మన్మథాది భక్తుల కాయా దేవతలతో నైక్యము రాకుండుటకు గారణమేమి?

ఉ:- ఒక జీవుడు మఱియొక పదార్థముతో నైక్యముజెందవలెనన్న తొలుత దన యుపాధి (స్థూలసూక్ష్మకారణ శరీరములు) నశింపవలెను। అది నశించిన యెడల జీవుడు బ్రహ్మమే యగును। అన్య దేవతలతో నైక్యము చెందు నవకాశము లేదు।

**8.** న చ జీవచైతన్యం స్వోపాధిం విహాయ మన్మథాద్యుపాధౌ ప్రవిశతీతి వాచ్యమ్। త్యక్తోపాధికస్య చైతన్యస్య సర్వవ్యాపి బ్రహ్మరూపస్య క్వచిత్ప్రవేశా-యోగాత్। నను యదేవ జీవచైతన్యం బ్రహ్మభూతం తదేవ మన్మథాదావస్తీతి మన్మథాది సాయుజ్యం సిద్ధమితి చేన్నైవమ్। తథాసతి క్రిమికీటాదిసాయుజ్య స్యాపి మన్మథాది భక్తానాం సిద్ధత్వాపత్తేః। యథా మన్మథాదీనాం స్వోపాధావాత్మ -తాదాత్మ్యాధ్యాసః, తథా నిరుపాధిక జీవస్య మన్మథాద్యుపాధితాదాత్మ్యాధ్యాసా-యోగాత్। మన్మథాది భజనా జ్జీవోపాధినాశాయోగాత్। సత్యాం జీవస్య స్వోపాధావస్యోపాధినా సహ తాదాత్మ్యాధ్యాసాయోగాచ్చ। తస్మాన్న మన్మథ సాయుజ్యం కామపురుషార్థః।

*ప్ర:-* జీవుడు తనయుపాధిని వీడి దేవతోపాధిని ప్రవేశింపకూడదా?

*ఉ:-* ఉపాధిని విడచిన వెంటనే సర్వవ్యాపక బ్రహ్మమైపోవుచుండ అది వేఱొక తావున ప్రవేశించుట అసంభవము।

*ప్ర:-* సర్వవ్యాపకముగాన మన్మథసాయుజ్యము కూడ నయాచితముగ లభించును కాదా?

*ఉ:-* అట్లైన పరబ్రహ్మము క్రిమికీటకాదులలో గూడ నున్నందున మన్మథాది భక్తులకు క్రిమికీటకాది సాయుజ్యముకూడ లభించుచున్నది. సాయుజ్యమున కర్థమిది కాదు। దేని సాయుజ్యము లభించునో ఆయుపాధి తనది యని యభిమానము జెందవలెను। నిరుపాధికపరబ్రహ్మరూపమునుబొందిన జీవుడు మన్మథాది శరీరములు తానని భ్రమజెందుట అసంభవము। అదియుగాక మన్మథాది దేవతల నర్చించుటచేత జీవుని యుపాధి నశింపజాలదు। తన యుపాధి యుండగా మఱియొక యుపాధియందు తాదాత్మ్యము జెందుట బొత్తుగా పొసగదు। కావున మన్మథ సాయుజ్యము "కామ" మను పురుషార్థమని యెవరును భ్రమింపరాదు।

**9.** నన్వేవం కామపురుషార్థత్వం మన్మథసాలోక్యసారూప్యసామీప్యానా మస్త్వితి చేన్నైవమ్। దేవతాన్తరసాలోక్యాదీనామపి పురుషార్థత్వాపత్తేః స్వర్గాదీనా మకామపురుషార్థత్వాపత్తేశ్చ।

*ప్ర:-* సాయుజ్య మసంభవమైనచో మన్మథసాలోక్యము లేక మన్మథ సామీప్యము లేదా మన్మథ సారూప్యము బడయుటయే "కామము" అను మూడవ పురుషార్థమని యేల చెప్పరాదు?

ఉ:- మన్మథ సాలోక్యాదులు పురుషార్థమైనపుడు శివసాలోక్యము విష్ణుసా-లోక్యము మొదలైనవికూడ పురుషార్థములే యనవలసి వచ్చును. లేదా ఒక్క మన్మథ సాలోక్యము తప్ప స్వర్గలోకాదులెవ్వియు పురుషార్థములు కావనవలసివచ్చును. ఇది యంతయు నసంగతము.

**10. నను తర్హి స్రక్చన్దనాదిః కామపురుషార్థః కామ్యత ఇతి కామ ఇతి వ్యుత్పత్తేః । స్రక్చన్దనాదిర్హి పురుషైః కామ్యతే। తస్మాత్ శబ్దస్పర్శరూపరసగన్ధాత్మక ఇష్టో విషయః కామః। మైవమపి। నహి లోకే ఓదనం ఫలం పయో వా భుంజానో జనః కామాతుర ఇత్యుచ్యతే కిన్తర్హి సురతసక్త ఏవ। తస్మాత్ పురుషస్య స్త్రీ వ్యతికరాభిలాషః, స్త్రియాః పురుషసమ్పర్కాభిలాషశ్చ కామః। అతఏవ కామస్య రతిర్భార్యేతి దృశ్యతే పురాణాదిషు। యథా భార్యా భర్త్రధీనా తథా సురతాపర పర్యాయరతిస్సురతాభిలాషాధీనేతి।**

ప్ర:- కామింప బడునది (కోరబడునది) కామము గాన చందన తాంబూలాది పదార్థములు. "కామ"మగును. ఇట్లే శబ్దస్పర్శ రూప రసగంధములలో తనకు గానలసిన దెద్దియైనను దానిని కామ మనవచ్చును కదా!

ఉ:- ఓయీ! అటులనరాదు. అన్నమునో ఫలమునో క్షీరమునో భుజించు వానిని "కామాతురు" డనరు. స్త్రీసుఖ మభిలషించు వానినే కామాతురు దని పిలతురు. పురుషునకు స్త్రీయందును, స్త్రీకి పురుషునందును కలిగెడి ప్రేమకు కామమని పేరు. ఈ విషయమే పురాణములందు కామునకు రతీదేవి భార్య యని వర్ణింపబడెను. లోకమున భార్య యెట్లు పతియధీనమందుండునో అటులనే రతి (సంభోగము) కామమునకు (అభిలాషకు) అధీనమై యుండును. దీనింబట్టి కామ శబ్దమునకు లౌకికార్థ మరయ వలెనన్న సంభోగాభిలాష యననవలెను.

**11. ఇదమపి న యుక్తం, యద్యద్ధి కురుతే జన్తు స్తత్తత్కామస్య చేష్టితమితి స్మరణాన్న సురతాభిలాష ఏవ కామః। కిన్తు విషయాభిలాషః కామః। కముకాన్తౌ కాన్తిరిచ్ఛాకమేర్భావే ఘఞి కామ ఇతి రూపమ్। తస్య ఇచ్ఛేత్యర్థః। ఇచ్ఛా హి విషయవిషయా, తస్మాచ్ఛబ్దస్పర్శాది విషయేచ్ఛైవ కామః।**

నిజమరసినచో నిదియు పొసగదు. జీవుడేకార్యముచేసినను అది కామము యొక్క పనియేయని శాస్త్రము వచించుటంజేసి రతిసుఖవాంఛ మాత్రమే కామముకాదు. సామాన్యమగు విషయాభిలాషయెల్ల కామ మనుట యుక్తము "కామ"శబ్దము "కమ్"

అను ధాతువునుండి పుట్టినది. ఆధాతువునకు కోరుట యని యర్థము. అది యే విషయమును గూర్చి యైనను కావచ్చును. కనుక ప్రపంచ విషయములను గూర్చిన కోరిక ప్రతిది "కామ"మని తెలియదగును.

**12. న, ఇచ్ఛాయాః పురుషార్థత్వాయోగాత్। పురుషేణ విషయ ఏవార్థ్యతే న త్విచ్ఛా, ఇచ్ఛాయా ఇష్యమాణత్వాసమ్భవాత్,కామో హి పురుషార్థః। తస్మా దిష్యమాణో విషయ ఏవ కామః।**

పై దెల్పిన చర్చ బాగుగనే యున్నది కాని పురుషార్థములలోని కామశబ్దమున కిది పొసగదు. ఏలయన కామశబ్దమునకు "కోరిక" యనునర్థము నీవు తెల్పితివి, జీవులచే కోరబడునది పురుషార్థము కాని "కోరిక"కాదు. నాకొక "కోరిక" కలుగవలెనని యెవడును కోరుకొనడు. కావున కోరబడు వస్తువునకు "కామ" మను పేరు చెల్లును.

**13. తేషు చ విషయేషు స్త్రియాః పుమాన్ పుంసః స్త్రీ చ ప్రధానమాలమ్బనమితి కృత్వా పురుషస్య కామపురుషార్థః స్త్రీ,స్త్రియాశ్చ కామపురుషార్థః పురుష ఇత్యుచ్యతే। యద్యప్యేవం స్త్రీపురుషయోరేవేష్టయోః కామపురుషార్థత్వం తథాపి తద్భోగోపకరణానామపి స్రక్చన్దనాదీనాం కామపురుషార్థత్వమస్త్యేవ -తస్మాత్ శృంగారరసస్య యదాలమ్బనం యచ్చోద్దీపనం తత్సర్వం కామపురుషార్థః। నేదమపి యుక్తమ్।"న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏవాభివర్ధతే" ఇతిస్మరణాత్। కామాత్క్రోధః ప్రభవతీతి గీతావచనాచ్చేచ్ఛైవ కామ ఇతి।**

ఇట్లుండ పురుషుడు వాంఛించునది స్త్రీని: స్త్రీ వాంఛించునది పురుషుని, యగుట పురుషునకు స్త్రీపురుషార్థ మనియు, స్త్రీకి పురుషుడు పురుషార్థమనియు జెప్ప వచ్చునా? యనిన నదియు గూడదు. అటులయిన స్త్రీ పురుష సుఖసాధనములైన చందనతాంబూలపుష్పమాలాదులన్నియు కామ పురుషార్థమే యగును. ఇది యెన్నటికిని పొసగదు. కామ శబ్దమునుగూర్చి శాస్త్ర ప్రయోగమును జూతము:- "మండుచున్న యగ్నిహోత్రుని యాకలి దీర్పదలచి దానిని శమింపజేయుటకై వేయి హోమమొనర్చిన యెడల దానితో దృప్తి జెందక జ్వాల యెటుల పెచ్చరిల్లునో అటులనే మానవునకొక వస్తువు లభించిన వెంటనే మఱియొక వస్తువుపై నాస పొడుమును. కామము శమింపరానిది" యని మనుస్మృతి తెల్పుచున్నది.

"కామమునుండి క్రోధము జనించుచున్న"దని గీత బోధించుచున్నది. కావున మనసు నందుదయించు కోరికయే కామ పదమున కర్థమని తలంచుట కవకాశము కలదు.

**14. మైవమ్। ఇచ్ఛాపి కామ ఏవ, పరన్తు ఇచ్ఛాయా న పురుషార్థత్వమితి। - అత్రాయం సిద్ధాన్తః కామనాత్మకః కామ్యమానాత్మకః కామనాధిదైవాత్మకశ్చ కామస్త్రివిధః। తత్ర కామనా ఇచ్ఛా, కామ్యమానా విషయాః, కామనాధిదైవం మన్మథః। న జాతు కామః కామానాముపభోగేన శామ్యతీత్యత్ర ప్రథమాన్త పదస్యేచ్ఛార్థః। షష్ఠ్యన్త పదస్య తు విషయోర్థః। "యద్యద్ధి కురుతే జన్తుస్తత్ త్కామస్య చేష్టిత" మిత్యత్ర "కామ జానామి తే మూలం సఙ్కల్పాత్కిల జాయసే" ఇత్యత్ర చ కామశబ్దస్యేచ్ఛార్థః। కామాత్క్రోధః ప్రభవతీత్యత్రాపీచ్ఛైవ। కామక్రోధ లోభమోహమదమాత్సర్యాఖ్యాన్తశ్శత్రువర్గపతితశ్చ కామ ఇచ్ఛాత్మక ఏవ। కామోకార్షీన్మన్యు రకార్షీదితి శ్రుతిగతకామశబ్దస్యాపి స ఏవ, మన్యు సాహచర్యాత్।**

కాని యీయర్థమిచట నసంగతము. కామపదమునకు కోరిక యనుట తప్పుకాదు. అది పురుషార్థము కానందున నాయర్థమిచట పనికి రాదు. కామశబ్దముయొక్క తత్త్వమును వినుము.

***కామము మూడు విధములు। 1 కోరిక, 2 కోరబడునది, 3 కోర్కెపై నధికారముగల దేవత। అందు కోరికయన మనసులో కలిగెడి ఆశ। కోరబడునవి ఆయా విషయములు। కోరికపై నధికారి మన్మథుడు। ఈ యర్థము లెచటగలవో చూడుడు!***

"కామము కామములననుభవించుటచే జల్లారదు." అను మనుస్మృతి వచనములో మొదటి కామ పదమునకు "కోరిక" యని యర్థము. రెండవ కామ శబ్దమునకు (సుఖవిషయములు) "కోరబడువస్తువులు" అని యర్థము. ఇట రెండర్థములు స్పష్టముగానున్నవి.

"జీవుడేది చేసినను కామము వలననే చేయును" అను శాస్త్రవాక్యములోని కామపదమునకు "కోరిక" యని యర్థము. "కామమా! నీపుట్టుక నెఱింగితిని. నీవు సంకల్పము నుండి జనించుచున్నావు!" అను మఱియొక వాక్యమునను,

"కామమునుండి క్రోధము కల్గుచున్నది" అనెడి గీతా వాక్యమునను కామ శబ్దమునకు "కోరిక" యనియే యర్థము.

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనియెడు అరిషడ్వర్గమునందలి కామపదమునకును "కోరిక" యే యర్థము.

'కామః అకార్షీత్' 'మన్యుఃఅకార్షీత్' అను వేదవాక్యములందలి కామపదమునకును "కోరిక" యే యర్థము. (మన్యుః అనగా క్రోధము. దీని ప్రక్కనున్నందున కామ శబ్దమున కిచ్ఛయని యర్థము)

**15. పురుషార్థః కామస్తు విషయా ఏవ, స్త్రీపురుషౌ చ శబ్దాదివిషయాత్మకావేవేతి నావ్యాప్తిః। వివశా కామవధూర్విబోధితేత్యాదౌ కామస్తు మన్మథ ఏవేతి బోధ్యమ్। ఏతేన సైన్ధవాదిపదానామివ కామపదస్యాపి ప్రకరణవశాదభీష్టార్థగ్రహణమితి సిద్ధమ్। యద్యప్యేవమభీష్టవిషయస్యైవ కామపురుషార్థత్వస్తథాపి, విషయాభిలాషస్య విషయాభిలాషాధిదైవతస్య చ కామపురుషార్థత్వమస్త్యేవ వ్యపదేశివద్భావేన। కామపురుషార్థహేతుత్వాత్తయోః। న హి విషయాభిలాష రహితో విషయప్రాప్త్యర్థం యతతే। కాకతాలీయతస్సిద్ధేన వా విషయేణ హృష్యతి। విషయాభిలాషశ్చాన్తఃకరణధర్మః। తస్య చ ప్రద్యుమ్నాపరపర్యాయః కామోధి-దైవతమితి। విషయాభిలాషశ్చ విషయగతశృంగారాధీన ఇతి శృంగారరసాధి-దైవతం కామ ఇత్యుచ్యతే। తస్మాదిష్యమాణశ్శబ్దాదివిషయ ఏవ కామపురుషార్థః**

పురుషార్థములలోని కామశబ్దమునకు మాత్రము "కోరబడువస్తు" వని యర్థము. స్త్రీపురుషులుకూడ కోరబడు వస్తువులేగాన వానికిని నీపదము వర్తించును.

"వివశా కామ వధూర్విబోధితా" (కుమారసంభవము) అనగా (మన్మథుడు దగ్ధమైనపుడు) "మూర్ఛిల్లిన మన్మథునిభార్య (కొంతవడికి) మేల్కొనినదై" అని యర్థము. ఇట్టి స్థలములందు కామశబ్దమునకు మన్మథుడని యర్థము.

ప్ర:- ఒక్క కామశబ్దమున కనేక విధముల నర్థము చెప్పదగునా?

ఉ:- లెస్సగా చెప్పదగును. వినుము. "సైంధవ" మనగా ఉప్పు, గుఱ్ఱము అని రెండర్థములు కలవు. అన్నము తినునపుడు "సైంధవము తెమ్ము" అని పల్కిన "ఉప్పు" తెత్తురు. యుద్ధమున కేగ బోవుచు "సైంధవము" తెమ్మనిన "గుఱ్ఱము" ను పట్టుకవత్తురు కాని సైనికుని చేతిలో"ఉప్పు"నిడరు. ఇట్లే పదములకు సందర్భమును బట్టి యర్థము మారుట సుప్రసిద్ధము. కామ పదమునకు నిటుల ప్రకరణమును బట్టి యర్థము మారును.

కామపదమునకు "కోరబడునది" అనునర్థము మాత్రము చెప్పినను కోరబడుదానికి గారణమైన కోర్కె కోరికపైనధికారియగు మన్మథుడుగూడ ("వ్యపదేశివద్భావము"అను శాస్త్రీయన్యాయ్యము ననుసరించి) అర్థము వచ్చును. విషయాభిలాష లేనిదే యెవ్వడును విషయమునకై యత్నింపడు. యత్నింపకయే ఒక వస్తువు దొరికినను విషయాభిలాష లేనిచో దానింగూర్చి సంతసింపడు. అభిలాషయనునది మనస్సుయొక్క ధర్మము. ప్రద్యుమ్నుడని మారు పేరు గల మన్మథుడు దానిపై నధికారి. అభిలాష-ఒక విషయములోని సౌన్దర్యమునకు లోబడి యుండును. కావున (సౌన్దర్యమునకు) శృంగారమునకు నాయకుడు మన్మథుడని పేరు వచ్చెను.

పై చర్చనుబట్టి శబ్దస్పర్శ రూపరసాది పదార్థము **"కామము"** అను పురుషార్థమని తేలినది.

**16. స చ విషయస్సన్నసన్నితి ద్వివిధః। తత్ర ధర్మసమ్మతః సన్। ధర్మ విరుద్ధస్త్వసన్। ఆద్యో భగవద్విభూతిభూతః ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభేతి గీతావచనాత్। నను కః కామో ధర్మసమ్మతః? కశ్చ ధర్మవిరుద్ధ? ఇతి చేదుచ్యతే। గృహస్థస్య ఋతౌ దారగమనం ధర్మసమ్మతః కామః। యజ్ఞ-శిష్టాశనమ్, విష్ణునిర్మాల్యస్రక్చన్దనాది భగవద్గుణకథానాం గానం శ్రవణమ్, భగవద్భాగవతరూపదర్శనం చేత్యాది। ధర్మవిరుద్ధస్తు పరదారగమనం నిషిద్ధదివసేషు స్వదారగమనమ్। అయజ్ఞశిష్టాశనమవిష్ణునిర్మాల్యస్రక్చన్దనాది, గ్రామ్యకథానాం గానం శ్రవణం వేశ్యాదిరూపదర్శనం మద్యపానం కళంజ -గృంజనం పలాణ్డుభక్షణం విధవోద్వాహః మాంసభక్షణం చేత్యాది।**

ఆ పదార్థము సత్పదార్థము అసత్పదార్థము అని రెండు విధములు. ధర్మ సమ్మతమైనది సత్పదార్థము. ధర్మవిరుద్ధమైనది అసత్పదార్థము. అందు ధర్మసమ్మతమైనది భగవత్సంబంధముగల పదార్థము ఏలయన-"ధర్మమునకు విరుద్ధము కాని కామము నేనే" యని భగవానుడు గీతయందు వెల్లడించెను.

*ప్ర:- కామములందు ఏది ధర్మ సమ్మతము? ఏయది విరుద్ధము?*

*ఉ:- వినుము. 'గృహస్థుడు ఋతుకాలమున భార్యతో గ్రీడించుట ధర్మ సమ్మతమగు కామము. భగవన్నివేదితమైన యన్నము, విష్ణునిర్మాల్యమైన పుష్పమాలాదిధారణము భగవద్గుణములు వినుట గీర్తించుట భక్తులను దర్శించుట*

మున్నగునవి ధర్మము. పరస్త్రీలను ప్రేమించుట-చెడు దినములందు భార్యతో రమించుట - భగవన్నివేదితము కాని పదార్థము భుజించుట-విష్ణునిర్మాల్యముకాని పుష్పమాలాదుల ధరించుట-చెడుకథల జెప్పుట వినుట-వేశ్యాదుల రూపము జూచుట మద్యపానము సేయుట-ఉల్లిగడ్డ వెల్లిపాయల దినుట- వితంతువుల బెండ్లాడుట- మాంసము దినుట మున్నగునవి ధర్మవిరుద్ధమైన కామము.

**17. తత్ర ధర్మసమ్మతకామసేవయా తు ఇహలోకే కీర్తిః। పరత్ర పునరభీష్టకామ-సిద్ధిశ్చ। ధర్మవిరుద్ధకామసేవయా తు ఇహలోకే అపకీర్తిః। నరకప్రాప్తిశ్చ। నను ఋతుదారగమనాదీని త్వయోక్తాని ధర్మా ఏవ, న తు కామా ఇతిచేన్నైవమ్-యత్ శ్రేయస్సాధనం తద్ధర్మః। యత్సుఖసాధనం తత్కామః। శ్రేయః పారలౌకికం సుఖమైహికమితి వివేకః। ఏవం స్థితే ఋతుదారగమనాదికం శ్రేయస్సాధనత్వేన ధర్మః,సుఖసాధనత్వేన కామశ్చ భవతి। సుఖాయ హి స్రక్చన్దనవనితాదీని వస్తూని లోకః కామయతే। కామితవస్తు సిద్ధ్యా చ ప్రహృష్యతి। సా చ కామసిద్ధిరర్థాధీనా। న హి ధనరహితస్య స్రక్చన్దనాదీష్టవిషయసిద్ధిరిత్యర్థవత ఏవ కామపురుషార్థసిద్ధిః, అర్థస్య ఫలం చ కామ ఏవ। అతఏవ అర్థానన్తరం కామో నిర్దిశ్యతే। అర్థస్య చ ధర్మః కారణమిత్యుక్తం ధర్మప్రశంసాయాం మయా। అతఏవ ధర్మస్యార్థాత్పూర్వం నిర్దేశః। ధర్మోఽర్థః కామశ్చేతి హి క్రమః।**

ధర్మ సమ్మతమైన కామమనుభవించుటచే నిహలోకమున గీర్తియు, పరలోకమున నభీష్టసిద్ధియు కలుగును. ధర్మవిరుద్ధకామము సేవించుటచే నీలోకమున నపకీర్తియు, పిమ్మట నరకప్రాప్తియు గలుగును.

*ప్ర:-* ఋతుకాలమున భార్యను జేరుట ధర్మమగును కాని దానిని కామమని యెట్లందురు?

*ఉ:-* ఓయీ దీనిని చక్కగా గుర్తింపవలెను. ఇట్టి ధర్మ సమ్మతకార్యము లోక దృష్టిలో ధర్మములు, మఱియొక దృష్టిలో కామములు గూడ నగును. ఎట్లన శ్రేయము కలుగజేయునది ధర్మము. సుఖ మొసంగునది కామము. శ్రేయమన బరలోక సుఖము, సుఖమైహిక భోగము. ఇట్లుండ-ఋతుకాలభార్యారతి వలన శ్రేయము గలుగును గాన ధర్మము, ఐహికసుఖ మొసంగునదిగాన కామముగూడ నగును.

ప్రతివాడును సుఖముకొఱకే కాంతాదులను గోరును. అవి లభించిన సంత సించును. వానికై ధనము కావలెను. ధనరహితునకు చందనతాంబూలవనితాద్యభీష్ట

విషయములు ప్రాప్తింపవు. కావున అర్థము కలవానికే కామపురుషార్థము లభించుట, అర్థమునకు ఫలము కామమే. కావుననే పురుషార్థముల గణనలో అర్థముతరువాత కామమును గణించిరి. అట్టి యర్థమునకు మూలము ధర్మమని నేను ధర్మప్రశంస యందు నిరూపించితిని. కావున అర్థమునకు పూర్వము ధర్మము పేర్కొనబడెను। ధర్మము-అర్థము- కామము-అని త్రివర్గముల క్రమము ప్రసిద్ధము.

**18. ఇమే చ ధర్మావిరుద్ధముపభుజ్యమానాః కామా వైరాగ్యాదిజననద్వారా మోక్షహేతవశ్చ భవన్తి। ఉప్యమానం హి క్షేత్రం శనైర్నిర్వీర్యతాం భజతే। న జాతుకామ ఇతి స్మృతి స్తు ధర్మవిరుద్ధకామపరేతి న విరోధః। ఏవం కామస్య మోక్షహేతుత్వాదేవ మోక్షాత్ప్రాక్కామస్య నిర్దేశః కామో మోక్షశ్చేతి।**

ధర్మసమ్మతమైన కామము ననుభవించువానికి గొంతకాలమునకు వైరాగ్య ముదయించి మోక్షహేతువగును.

*ప్ర:* - అనుభవించిన కొలది యాశమెండగును కదా!

*ఉ:* - ధర్మసమ్మతకామమం దిదియే విశేషము. ఎరువుపెట్టక పైరుమాత్రము వేయుచున్న పొలములోని సారము క్షీణించినట్లు ధర్మావిరుద్ధ కామమనుభవించు వాని హృదయక్షేత్రము నిర్వీర్యమై వైరాగ్యము పొందును. ధర్మ విరుద్ధ కామము సేవించువాని హృదయమున నాసలుపైపై జెలరేగుచుండును. "న జాతు కామః" అనెడిస్మృతివచనము దీనినే వచించెను. ఈరీతి (ధర్మసమ్మత) కామము మోక్షహేతువగుటచే మోక్షమునకు ముందు కామపురుషార్థము గణింపబడెను.

**19. నను నిష్కామ ఏవ మోక్షం గచ్ఛతీతి కామో మోక్షవిరోధ్యేవేతి చేన్నైవమ్। ధర్మవిరుద్ధ ఏవ కామో మోక్షవిరోధీ ధర్మావిరుద్ధస్తు మోక్షోపాయభూత ఏవ। తథా హి విషయోపభోగః కామః। తే చ విషయాః శబ్దః స్పర్శోరూపం రసో గన్ధశ్చేతి పఞ్చక్రమేణ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యపఞ్చేన్ద్రియగోచరాః। తత్ర శ్రోత్రేణ భక్త్యా శ్రూయమాణో వాచోచ్చార్యమాణశ్చ భగవన్నామగుణకథామయ శ్శబ్దః పాపనిర్హరణచిత్తశుద్ధ్యాదిజననద్వారా మోక్షహేతుః। తన్మయా ప్రపఞ్చితం కలిభూషణే। మనసి కల్పితం ప్రతిమాయాం దృశ్యమానం చ భగవద్రూపం ముక్తిప్రదమేవ। ఏవం భగవత్పాదాబ్జార్పితతులస్యాదిగన్ధగ్రహణం ముక్తి ప్రదమేవ। తథా భగవన్నివేదితాన్నాదిగత రసాస్వాదనం ముక్తిదమేవ। ఏవం**

**భగద్విగ్రహాదిస్పర్శశ్చ ముక్తిహేతుః। తథోక్తం కులశేఖరేణ"జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం, పాణిద్వన్ద్వసమర్చయాచ్యుతకథాం శ్రోత్ర ద్వయత్వం శృణు। కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం, జిఘ్ర ఘ్రాణ ముకున్ద పాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్।" ఇతి।**

ప్ర:- కామరహితుడు మోక్షము పొందునని పెద్దలు వచింతురు. ఇట్లుండ కామము మోక్షప్రదమెట్లగును?

ఉ:- వినుము. ధర్మవిరుద్ధమైన కామము మోక్షమునకు ప్రతికూలము. ధర్మసమ్మతమైనది మోక్షమున కనుకూలము. ఎట్లన-

కామమన విషయానుభవము. శబ్దస్పర్శరూపరసగంధములు విషయములు. వాని ననుభవించు నింద్రియములు శ్రోత్రత్వక్ నేత్రజిహ్వాఘ్రాణములు. ఇక వీని ద్వారా పాపధ్వంసన మెట్లగునో చూడుము.

భగవన్నామము భగవత్కథ చెవిద్వారావిని నోటితోనుచ్చరించినందున పాపములు దొలగి చిత్తశుద్ధికలిగి తద్వారా మోక్షము కలుగును. ఈ విషయమును "కలిభూషణము"అను గ్రంథమున వివరించితిని. భగవంతుని విగ్రహము-అది మనసు నందునకల్పించుకొనినది కాని లేక నిజమైన ప్రతిమకాని, దానింజూచుట ముక్తి హేతువు. భగవంతుని పూజసేసిన తులసిని, పుష్పములను మూర్కొనుట మోక్షప్రదము. భగవంతునకు నివేదించిన పదార్థముల భుజించుట మోక్షహేతువు. భగవంతుని విగ్రహమును స్పృశించుటయు ముక్తి కారణము. భక్తాగ్రేసరుడైన కులశేఖరుని వాక్యముల దిలకింపుము!

***"ఓ నాలుకా! నీవు నారాయణుని నామముల నుచ్చరింపుము। ఓ హృదయమా! భగవంతుని ధ్యానింపుము. ఓ చేతులారా! మీరు శ్రీహరిని పూజింపుడు! చెవులారా! మీరు దేవదేవుని యద్భుతగాధలవినుడు! నేత్రములారా! మీరు మురళీధరుని దివ్యసుందర విగ్రహము దిలకింపుడు! పాదములారా! మీరు పురుషోత్తముని మందిరమునకు నడువుడు! ఘ్రాణేంద్రియమా! నీవు భగవత్పాదతులసిని మూర్కొనుము! ఓశిరమా! నీవు సర్వేశ్వరుని మ్రొక్కుము" ఇట్టిభగవంతత్సంబంధమైన విషయానుభవము మోక్షహేతువని గ్రహింపవలెను.***

**20. యది తు స్త్రీపురుషయోరన్యోన్యవ్యతికర ఏవ కామ ఇత్యాగ్రహః, తర్హి సోపి ముక్తి ప్రద ఏవ। గోపీనాం శ్రీకృష్ణ వ్యతికరేణ ముక్తత్వాత్। తథాధునాపి**

**స్త్రియశ్చిత్తే శ్రీకృష్ణవిగ్రహం పరికల్ప్య తేన సమం స్వయం క్రీడిత్వా ముక్తిం యాన్తు। యది పురుషాణామపి తథా విజిహీర్షాతర్హి పురుషా అపి చిత్తే శ్రీకృష్ణం పరికల్ప్యాత్మనశ్చ స్త్రియో విభావ్య క్రీడన్తు। తతః పురుషాణామపి ముక్తిఃస్యాదేవ। న చ పురుషాణా మనుచితమిదమితి వాచ్యమ్"విశ్వామిత్ర పరాశరప్రభృతయో వాతామ్బుపర్ణాశనా ధైర్యం నార్య ఇవాపసార్య సహజాం సన్త్యజ్య లజ్జామపి। సమ్భోగం కిల వవ్రురిత్యభిదధే పౌరాణికై" రితి సాహిత్యరత్నాకరాత్-రామావతారే యే మునయస్తం సమ్భోగం వవ్రుస్త ఏవ కృష్ణావతారే గోప్యో జాతా ఇతి భాగవతాచ్చ।**

ఏది యెట్లున్నను స్త్రీపురుష సంబంధమునకే కామశబ్దము ప్రసిద్ధి గాంచియున్నది. అది మోక్షహేతువగుటెట్లందువా? వినుము. అదియు మోక్షప్రదమే యగును. ఎట్టులన-గోపికాస్త్రీలు ముక్తిని బడసినది. యిట్టి సంబంధము చేతనే, ఇప్పుడైనను స్త్రీలు గోపికలవలె మనసు నందున శ్రీకృష్ణమూర్తిని కల్పించుకొని అతనితో గ్రీడించి ముక్తిగాంతురు గాక! కావలయునన్న పురుషులుగూడ చిత్తమందు శ్రీకృష్ణుని కల్పించుకొని తాము స్త్రీలుగ భావించుకొని క్రీడించి తరింపవచ్చును.

పురుషులకిది యనుచితమందువా! కానేరదు వినుము:-

"ఆకులలములుదినుచు, అదియు వర్జించి నీరుద్రావుచు, నదియు విడనాడి గాలినిమాత్రము పీల్చుచును. తపమొనర్చు విశ్వామిత్రాది మహర్షులుగూడ కామమును విడనాడజాలక స్త్రీలవలె ధైర్యము వీడిరి. అంతతో బోక సిగ్గువిడచి రతిసుఖమును వరించిరి" అనియొక మహాకవి చెప్పెను (సాహిత్యరత్నాకరము)

రామావతారసమయమున రతిసుఖమును వాంఛించిన మునీశ్వరులు గోపికలై జన్మించిరని భాగవతము తెల్పుచున్నది.

**21. న చైవం భగవద్విషయసేవాపి బన్ధకర్యేవేతి వాచ్యమ్। "అశేషసఙ్క్లేశశమం విధత్తే గుణానువాదశ్రవణం మురారేః కిం వా పునస్తచ్చరణారవిన్ద పరాగసేవారతిరాత్మల" బ్ధేతి భాగవతాత్। న చ భగవద్విషయోపభోగో న కామ ఇతి వాచ్యమ్। విషయోపభోగస్య కామత్వేన భగవద్విషయోప భోగ్యస్యాపి కామత్వాత్। న చ విషయా ఏవ కామ ఇత్యుక్తమితి వాచ్యముపభుజ్యమాన విషయాణామివ విషయోపభోగస్యాపి కామత్వాత్। న చేష్యమాణవిషయాః**

**కామఇత్యుక్తమితి వాచ్యమిష్యమాణవిషయా అప్రాప్త కామ, ఉపభుజ్యమాన విధయాస్తు ప్రాప్తకామ ఇతి వివేకాత్। నను యది శబ్దాదయః పఞ్చవిషయాః కామస్తర్హి తదనన్తర్భూతో వ్యవాయః కామో నస్యాత్స ఏవ హి సార్వజనీనః కామ ఇతిచేదుచ్యతే।వ్యవాయస్య స్పర్శేఽన్తర్భావ ఇతి। ఏవం భగవద్విషయోపభోగస్య మోక్షహేతుత్వముక్తమ్.సాధారణవిషయోభోగోపి మోక్షహేతురేవ। తథా హి అభిష్టార్థోపభోగాదన్తర్ముఖం భవతి పురుషస్య మనః, తద్వాత్మస్వరూపగ్రాహకతయా ముక్తిప్రదమ్।**

*ప్ర:-* సేవకావృత్తి జీవునిబంధించును. కావున భగవత్సేవయు బంధకమేకదా?

*ఉ.* భగవత్సేవ అట్టిదికాదు. "శ్రీకృష్ణుని గుణగణము వినుట గీర్తించుటచే సమస్తకష్టములను దొలగించుచుండనా దేవదేవుని పాదసేవయొక్క మహిమనేమని వర్ణింపవలె" నని భాగవతము తెల్పుచున్నది. కావున భగవత్సేవ బంధకముకాదు.

*ప్ర:-* భగవత్ప్రసాదము భుజించుట, నిర్మాల్యమునాఘ్రాణించుట మున్నగునవి కామమెట్లగును?

*ఉ:-* శబ్దస్పర్శాది విషయములు కామమైనపుడు భగవన్నిర్మాల్యాదుల ననుభవించుటయు కామమేయగును.

*ప్ర:-* ఇంతయేల కామమన శబ్దస్పర్శాది విషయములు అని చెప్పరాదా?

*ఉ:-* విషయములు మాత్రమే కామముకాదు. వానిని అనుభవించుటయు కామమే యగును.

*ప్ర:-* కోరబడు విషయము కామమన వచ్చునా?

*ఉ:-* అందును కొంచెము భేదమున్నది. కోరబడు విషయములలో ననుభవమునకువచ్చిన వానికి ప్రాప్తకామమనిపేరు. రాని విషయముల కప్రాప్త కామమని పేరు.

*ప్ర:-* తాము తెల్పిన రీతిశబ్దస్పర్శాదులు కామమనినచో స్త్రీసుఖము వీనిలో జేరదు గాన సర్వజన ప్రసిద్ధమైన కామశబ్దమును తాము కాదనవచ్చునా?

*ఉ:-* అదియు స్పర్శసుఖమున జేరును. కాన చింతింపకుము. పైచర్చవలన భగవత్సంబంధమైన కామము మోక్షకారణమని తెలిసికొంటిమి. ఇంతయేకాదు. ప్రపంచములోని సమస్త భోగములును ముక్తి హేతువులని చెప్పవచ్చును.

ఎట్లన-మానవుడు తానభిలషించు పదార్థము పొందినపుడు అవ్విషయమగు నాసయుడిగి శాంతచిత్తుడగును. అపుడు మనసున కంతర్ముఖత్వమువచ్చును. అనగా బాహ్యవిషయముల మరచి లోపలి వస్తువువైపునకు మరలు పరిస్థితి వచ్చును. ఇది ముక్తి హేతువు. ఇదియొక విధము: ముక్తికనువగు మఱియొక విధము చూడుము.

**22. యద్వా-శ్లో॥ ఆత్మా త్వం గిరిజామతిః పరిజనః ప్రాణాశ్శరీరం గృహం పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధి స్థితిః సఞ్చారః పదయోః ప్రదక్షణవిధిః స్తోత్రాణి సర్వా గిరో యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శమ్భో తవారాధనమ్ ఇత్యనుసన్ధానపూర్వకం కామోపభోగో హి ముక్తిప్రదః। అథవా విషయాన్భుంజాన ఏవ విషయగతాన్ దోషాన్విదిత్వా విషయాసక్తిమ్పరిత్యజ్య పరమాత్మానమన్వేషతి నత్వభుఞ్జాన ఇతి విషయభోగో ముక్తి హేతురేవ।**

*మానవుడెట్టి కామమనుభవించుచున్నను అతని భావనాబలముచే నయ్యది ముక్తి హేతువగు తెఱంగుకలదు। భావనయెట్టిదో గమనింపుము!*

"హేశంభో" దీనశరణ్యా! నీవు నాయాత్మస్వరూపుడవు. పార్వతీదేవి నాబుద్ధిస్వరూపిణి. నాప్రాణములు మీ సేవకులు. నాదేహమే మీగృహము. నాదేహేన్ద్రియములతో ననుభవించెడిదంతయు నీపూజావిధానము. నానిద్రయే నిన్ను గూర్చిన సమాధ్యవస్థ నాపాదములతో నెచ్చట దిరిగినను అదియంతయు సర్వాన్తర్యామియగు నీకుప్రదక్షణమొనర్చుటే. నామాటలన్నియు నీస్తోత్రములు. ఇంతియే కాదు. నేనొనర్చు ప్రతికార్యము నిన్నారాధించుటయేయని యీవిధముగా భావించుటచే ముక్తికలుగును. లేదా-

ప్రాపంచికవిషయముల ననుభవించుచుండియు విషయములలోని దోషములను దెలిసికొని అందాసక్తిని విడనాడి పరమాత్మను గూర్చి యొక దన్వేషించును. అనుభవింపక యిట్లు చేయజాలదు. ఇటుల విషయోపభోగము ముక్తిహేతునని యెఱుంగవలెను.

**23. "స శాన్తిమాప్నోతి న కామకామీ" ఇతి గీతావచనన్తు అజ్ఞ పరమ్। అజ్ఞో హి విషయదోషాన్న జానాతి। కే పునర్విషయదోషా ఇతి చేదుచ్యతే। అస్థిరత్వం సాతిశయత్వమనైకాన్తికత్వఞ్చ। అతఏవ విషయా అలబ్ధాః, లబ్ధాశ్చ నష్టాస్తాపం కుర్వన్తి-న చైతావతా విషయోపభోగస్త్యాజ్య ఇతి మన్తవ్యమ్।**

**సర్వాత్మనా విషయపరిత్యాగే శరీరయాత్రాయా ఏవాసిద్ధేః-కిన్తర్హి? ధర్మావిరుద్ధా విషయా భోజ్యా అన్యేత్యాజ్యాః। ధర్మావిరుద్ధః కామో హి మోక్షహేతుః॥**

*ప్ర:-* కామములన్నిటి విడనాడినగాని ముక్తిరాదని గీత బోధించుచున్నది కదా?

*ఉ:-* అది యజ్ఞానుల విషయము. అజ్ఞుడు ప్రాపంచికవిషయములలోని దోషముల గుర్తింపజాలడు. కావున తన్మయుడై యసుభవించును. అట్టియెడ వైరాగ్యమునకు తావుండదు. జ్ఞానియన్ననో అనుభవించునపుడు విషయములలోని దోషములను గుర్తింపజాలును. క్రమముగా వైరాగ్యమలవరచుకొనును.

*ప్ర:-* విషయములలోని దోషములన నెవ్వి?

*ఉ:-* ప్రాపంచిక విషయములన్నియు ననిత్యమైనవి. కావున ప్రతివిషయ మందును. "అనిత్యత్వము" అనెడి దోషమున్నది. మఱియొక దోషమెద్ది యన-తనకన్న గొప్పవిషయము మఱియొకటి యుండుట, ఈదృష్టిలో అన్ని వస్తువులు తక్కువవియే యగును. ఇది రెండవదోషము, ఒకవస్తువును పోలిన మఱియొక వస్తువుండుట మూడవదోషము. ఇందుచే నే విషయమునకును గొప్పతనమురాదు. ఇట్టిదోషములన్ని వస్తులందును కలవు. కావుననే ప్రాపంచిక విషయములన్నియు మనుజునకు సంతాపము కలిగించుచుండును. దొరకినవి నశించునపుడు బాధను కలిగించును.

*ప్ర:-* అటులైన ఏవిషయమునుకూడ దరిజేరనీయకుండుటమేలు కాదా!

*ఉ:-* ఓయీ! అది యసంభవము. విషయములతో సంబంధములేక జీవించుటయే దుర్లభము. కావున ధర్మవిరుద్ధవిషయముల విడనాడి ధర్మసమ్మత విషయముల ననుభవించుట కర్తవ్యము. ఇదిముక్తి కారణమని పూర్వము వివరింపబడెను.

**24. నను కామో మోక్షశ్చేత్యుభౌ స్వతన్త్రపురుషార్థావేవ సుఖప్రదత్వాత్। సుఖప్రదో హి పురుషార్థః। అర్థధర్మౌ తు న స్వతన్త్రపురుషార్థౌ। కిన్తర్హి? కామమోక్షోపాయత్వేన పరతన్త్రపురుషార్థౌ। న హి ధర్మోర్థో వా సాక్షాత్సుఖ -ప్రదః। తథా చ కామస్య మోక్షోపాయత్వకథనమయుక్తమితి చేన్నైవమ్। యే త్రివర్గమేవాభ్యుపగతవన్తస్తేషామ్మతేన కామ ఏవ స్వతన్త్రపురుషార్థః। మోక్షవాదినాన్తు పరతన్త్ర ఏవ కామః। న హి విషయోపభోగస్సాక్షాత్సుఖం**

ప్రదత్తే। కిన్తర్హి అన్తఃకరణమన్తర్ముఖం విధాయైవ బ్రహ్మభావలక్షణో మోక్షస్తు సాక్షాత్సుఖరూప ఏవ।

పురుషార్థమనగా సుఖప్రదమైన విషయము. కామము మోక్షము ఈరెండును సుఖదాయకము లైనందున రెండును స్వతంత్రముగా పురుషార్థము లనవలెను। అర్థము-ధర్మము మాత్రము స్వతంత్రములుకావు. అర్థము 'కామ హేతువు' ధర్మము మోక్షహేతువు గాన నవి పరతంత్రపురుషార్థములు. ధర్మార్థములు స్వయముగ సుఖమీయజాలవు కద!

ప్ర:- ఏదియెట్లున్నను కామము మోక్షోపాయమనుట యుక్తమగునా?

ఉ:- కొందఱు శాస్త్రకారులు పురుషార్థములు మూడేయని వాదింతురు. వానికి త్రివర్గమని పేరు. వారిమతములో "కామము"స్వతంత్రపురుషార్థము. మోక్షముతో మూడుపురుషార్థములని చెప్పెడివారి మతములో "కామము" స్వతంత్రమైన పురుషార్థము. మోక్షముతో నాల్గుపురుషార్థము లనెడి మతమున కామము పరతన్త్రపురుషార్థము. ఏలయన విషయానుభవము ఎకాయెకి సుఖము నీయదు. మనసును అన్తర్ముఖము చేయగల్గును. అపుడు సుఖము లభించును. మోక్షమన్ననో జీవునకు బ్రహ్మభావముగాన అది స్వయముగా సుఖస్వరూపము కాన స్వతంత్రపురుషార్థము.

**25. కిఞ్చ బిమ్బసుఖం మోక్షః, ప్రతిబిమ్బసుఖం కామసుఖమ్। ప్రతిబిమ్బస్య బిమ్బపరతన్త్రత్వాన్మోక్షపరతన్త్ర ఏవ కామః। అపి చ దుఃఖాత్మకా విషయాః కథం నిత్యసుఖం జనయేయుః? న కథమపి। కిన్తు విద్యమానస్యైవ సుఖస్యాభి-వ్యంజికాం క్షణికామన్తఃకరణవృత్తిం జనయన్తి। అథవా భవతు కామస్య సుఖప్రదత్వం, నైతావతా స్వతన్త్రపురుషార్థత్వం కామస్య! స్వతన్త్రపురుషార్థో హి సుఖమ్। సుఖం హి పురుషైరర్థ్యతే। తచ్చ సుఖం మోక్ష ఏవ। సచ్చిదానన్ద బ్రహ్మభావలక్షణత్వాన్మోక్షస్యేతి, మోక్ష ఏవ స్వతన్త్ర పురుషార్థః। సుఖాభివ్యంజక -వృత్తి జనకత్వాత్కామస్య మోక్షోపాయత్వమర్థాధీనత్వాద్విషయాణామర్థస్య కామోపాయత్వం ధర్మాధీనత్వాదర్థస్య ధర్మస్యార్థోపాయత్వమితి బోధ్యమ్।**

మఱియు మోక్షము స్వతస్సుఖరూపము అనగా బింబసుఖము. కామము ప్రతిబింబ సుఖము అనగా అద్దములో కనపడు రూపమువంటిది. ప్రతిబింబము బింబమునకు లోబడియుండుగాన కామము మోక్షమునకు పరతన్త్రమైయుండును.

ప్ర:- దుఃఖరూపములైన ప్రాపంచిక విషయములు నిత్యసుఖరూపమగు మోక్షమునకు హేతువు లెట్లగును?

ఉ:- కాజాలవు, కాని, తనయందు దాగియున్న సుఖమును క్షణకాలమనుభవించుటకు వీలుకలుగజేయును. లేదా-కామము సుఖప్రదమే యగుగాక! అంత మాత్రమున స్వతంత్రపురుషార్థము కానేరదు. ఏలయన పురుషులు ప్రార్థించునది సుఖమైయుండవలెను. మోక్షమొక్కటియే సుఖస్వరూపము. అదియే సచ్చిదానన్ద సుఖస్వరూపము. కావునమోక్షమొక్కటియే స్వతన్త్రపురుషార్థము. ఇక ధర్మార్థ కామములు మోక్షహేతువు లెట్లగునో చూడుడు!

సుఖమును కలిగించు మనస్థితిని కలుగజేయును గాన కామము మోక్ష హేతువగును. అనుభవయోగ్యములగు విషయములు అర్థమునకు లోబడి యుండును గాన అర్థము కామహేతువు. అర్థము ధర్మమార్గమున నార్జింపదగినది గాన ధర్మము అర్థసాధనము.

**26. నను యది కామో మోక్షహేతుస్తర్హి వ్యవాయోపి మోక్షహేతురేవ। న చేష్టాపత్తిః పారివ్రజ్యవిధానవైయర్థ్యా త్తస్మాన్మోక్షవిరోధ్యేవ కామ ఇతి చేన్నైవమ్। యది పారివ్రజ్యాదేవ ముక్తిస్తర్హి సర్వే దణ్డకమణ్డలుధారిణో విశిఖా యజ్ఞోపవీతా దామ్భికాస్సన్యాసినోముచ్యేరన్। జనకాదీనాఞ్చ గృహిణాముక్తిర్మాభూత్। కిన్తు చిత్తస్యాత్మప్రావణ్యాన్ముక్తిః తచ్చ చిత్తస్యాత్మ ప్రావణ్యం వ్యవాయాదపి భవత్యేవ। తథాహి అపక్వకషాయో యతిర్విజనే స్థిత్వా త్యక్తం సంసారం స్మరన్ సన్మనోమయ్యా భార్యయా సహ సంగచ్ఛతే। తాపం ఖేదఞ్చ ప్రయాతి తదుక్తం శ్రీధరేణ-"దమ్భన్యాసమిషేణవఞ్చితజనం భోగైకచిన్తాతురమ్। సమ్మొహ్యంతమహర్నిశం విరచితోద్యోగ్య క్లమైరాకుల" మితి-ధార్మికస్తు గృహస్థః ప్రేయస్యా సహ సంగత్య విధూతకామస్సన్నన్తర్ముఖో భూత్వా నన్దతి। నహి మనోమయభార్యేవ మాంసమయభార్యా సన్తాపకారిణీ భవతి। కిఞ్చ యతేర్దారేషు మనస్సంగః పాప హేతుఃగృహస్థస్య తు నేతి పారివ్రజ్యస్వీకారోఽపక్వకషాయస్య నరకాయైవ। శమదమాదిసమ్పన్నస్య తు పారివ్రజ్యం యుక్తమేవ।**

ప్ర:- కామము మోక్షోపాయమగునేని స్త్రీసుఖము కూడ మోక్షసాధనము కాగూడదా?

జౌనందుమా! సన్న్యాసాశ్రమ స్వీకరణము వ్యర్థమగును. కావున కామము మోక్షమునకు ప్రతికూలమనుట సమంజసము.

ఉ:- నీవనునది యుక్తముకాదు. సన్న్యాసము స్వీకరించిన మాత్రమున ముక్తి రాదు. వచ్చునేని జందెములద్రెంపి దండకమండలముల ధరించి స్వేచ్ఛగా దేశాటన మొనర్చు కపటసన్యాసులందఱకు ముక్తి రావలసియుండును. గృహస్థులైన జనకుడు మొదలగు జ్ఞానులకు ముక్తి లేదనవలసివచ్చును. ఇదంతయు నసంగతము. ముక్తి హేతువు లాశ్రమములు కావు. అంతఃకరణ మాత్మానుసంధానము చేయుటను బట్టి ముక్తి చేకూరును. ఆత్మానుసంధానము అనగా ఆత్మావైపునకు మరలుట, స్త్రీసుఖమువలనగూడ కలుగవచ్చును. ఎట్లన-వినుము.

సంసారవాంఛలు తీరని సన్యాసి యేకాంతస్థలమున గూర్చొని తాను విడనాడిన సంసారవిషయములను తలపోయుచుండును. భార్యను తలుచుకొని తన్మయు డగును। అంతియే కాదు. మనోమయమైన భార్యతో రమించును. పిమ్మట పరితాపము దుఃఖము జెందును. ఈవిషయము శ్రీధరుడెట్లు చెప్పెనో చూడుడు!

"కొందరు సన్న్యాసివేషము ధరించి లోకవంచకులై విషయసుఖములకై ప్రతిక్షణము నిరీక్షించుచుందురు. తామొనర్చిన కార్యములను తలంచుకొని రాత్రింబవళ్లు పరితపించుచుందురు. తామొనర్చినకార్యములను తలచువారికి తత్త్వజ్ఞానము లేశమాత్రమును స్ఫురింపదు."

ధార్మికుడైన గృహస్థు దన్ననో ప్రేయసితో విహరించుచున్నను అంతర్ముఖుడై బ్రహ్మానన్ద మనుభవించును. అధార్మికయతికి మనఃకల్పితమైన భార్య సంతాపహేతు వైనట్లు గృహస్థుని యథార్థభార్య సంతాపహేతువు కాజాలదు. మఱియు భార్య మనస్సంగమముకూడ యతికి పాపహేతువు కాని గృహస్థునకు గాదు. కావున నంతఃకరణ పరిపాకములేని సన్న్యాసము నరకహేతువు. శమదమాదిగుణసంపన్ను నకు సన్న్యాసము యుక్తము.

**27. తస్మాదజితేన్ద్రియస్య జితేన్ద్రియస్య చ విషయభోగశ్చిత్తమన్తర్ముఖం విధత్తే। కామత్యాగస్తు జితేంద్రియస్యైవేతి కామత్యాగాత్కామోపభోగశ్శ్రేయాన్। అతఏవ జనకాదయో గృహస్థాశ్రమే ఏవ స్థితవన్తో ముక్తిం యయుః- తస్మాద్వ్యవాయోపి ముక్తిహేతురేవ।**

27. కామము ననుభవించుటవలన చిత్తమంతర్ముఖమగును. జితేంద్రియునకు అజితేంద్రియునకు నిదిసమానము. కామమును బరిత్యజించుట మాత్రము జితేంద్రియునకే శ్రేయోదాయకము. అజితేంద్రియునకు ప్రమాదకరము. కావున కామత్యాగము కన్న కామభోగమే మంచిది. జనకాదులు గృహస్థాశ్రమమందుండి యే ముక్తి గాంచిరి. అందువలన స్త్రీసుఖముకూడ ముక్తికి అనునూలమని నేను వచించితిని.

**28. నచైవం వేశ్యాది వ్యవాయో ముక్తిహేతురితి వాచ్యం, ధర్మావిరుద్ధస్యైవ వ్యవాయస్య ముక్తి హేతుత్వాత్। కస్యచిత్తు వేశ్యాది వ్యవాయోపి ముక్తి హేతురేవ భవతి। వదన్త్యేవం వృద్ధాః। వదన్త్యేవం వృద్ధాః। ఏకశ్శుణ్ఠోఽన్యో ధార్మికశ్చేత్యుభౌ శ్రీశైలప్రభృతిప్రయాతౌ। మాఘమాసే తత్ర శుణ్ఠశ్శివరాత్ర్యాం మల్లికార్జునాలయ మగత్వా కశ్చి ద్వేశాయలయప్రవిశ్య నిశితయా సహ సంగత్య హతేకామే అన్తర్ముఖస్సన్మనసి మల్లికార్జునం కల్పయిత్వా తస్య షోడశోపచార పూజాం విధాయ కైలాసమగాత్। ధార్మికస్తు మల్లికార్జునాలయం ప్రవిశ్యత స్యాభిషేకాదికం కాయేన కుర్వన్నపి మనసా శుణ్ఠవేశ్యయో స్సమ్భోగచేష్టా ధ్యాయన్ సంప్రతితోఽభూదితి। తస్మాద్యేన కేనాప్యుపాయేనాత్మని మనసః స్థాపనాదేవ ముక్తి ర్నాన్యస్మాదితి సిద్ధాన్తః।**

ప్ర:- వేశ్యారతియు ముక్తిహేతువనరాదా?

ఉ:- అది ధర్మవిరుద్ధముగాన నట్లనరాదు. కాని ఒకానొక సందర్భమున నదియు మోక్షప్రద మగుచున్నది. ఈవిషయమున పెద్దలొకగాథ చెప్పుచుందురు.

ఒక మూర్ఖుడు నొకధార్మికుడును గలసి మాఘమాసమున శ్రీశైలము జేరిరి. మూర్ఖుడు కామలంపటుడై శివరాత్రియందు గుడికి వెళ్లక వేశ్యాగృహమునకేగి రమించెను. కాని కామము శమించినపిదప మనసును అంతర్ముఖమొనర్చి మనసునందు శ్రీశైలేశుని విగ్రహము కల్పించుకొని ఆ విగ్రహమున కభిషేకము-అర్చనము మున్నగువానిని మానసికముగాజేసెను. ఆతనితోవచ్చిన ధార్మికుడు శివరాత్రియందు శివాలయమునకేగి యచట నభిషేకార్చనలను దేహముతో జేయుచుండెనేకాని యాతనిమనసు తనసహచరుడు వేశ్యాగృహమున కేగిన విషయమును ఆతనిభోగమును తలపోయుచుండెను. వారిర్వురిలో మూర్ఖునకు కైలాసము-ధార్మికునకు నరకలోకము బ్రాప్తించెను. కావున నేరీతిగనైన మనసు నంతర్ముఖ మొనర్చుటవలననే ముక్తికాని రెండవ యుపాయము లేదు.

**29. స చ కామః ప్రాజ్ఞస్యైవ ముక్తిహేతుర్న త్వజ్ఞస్య. యథా పారివ్రజ్యప్రాజ్ఞస్యైవ ముక్తిహేతుర్న త్వజ్ఞస్య। తత్ర కిం కారణమితి చేదుచ్యతే ప్రాజ్ఞో హి విషయాన్భుక్త్వా తృప్యతి అజ్ఞస్తు తృప్త్యభావాద్విషయానేవ పునః కామయతే, తథా చ విద్యారణ్యాః-"పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతి తుష్టయే,విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి న చోరతా" మితి-**

కామము వివేకవంతునకే ముక్తిదాయకము కాని మూర్ఖునకు గాదు. సన్న్యాసము గూడ నంతయే. కారణమేమన-వివేకశాలి ప్రాపంచిక విషయములు ననుభవించి తృప్తిజెందును. మూర్ఖుడు తృప్తిజెందక పైపై విషయములు గోరుచుండును. శ్రీవిద్యారణ్యుల వారిట్లు చెప్పిరి- "స్వభావమును గుర్తించి యనుభవింపబడిన కామము తృప్తి హేతువగును.ఎట్లన-దొంగవానినైనను తెలిసికొని సేవించిన యెడల నతడు మిత్రడగును. ఆతనిపట్ల దొంగకాజాలడు".

**30. న హ్యతృ ప్తస్యాన్తఃకరణమన్తర్ముఖమ్భవతి యథా కథఞ్చిద్భవదపి క్షణికమేవ భవతి। తథా పరివ్రాజోఽజ్ఞస్య చిత్తం బహిర్ముఖమేవ భవతి। ప్రాజ్ఞస్యైవ పునరన్తర్ముఖమితి।**

తప్తిబడయని మనస్సు అంతర్ముఖము కాజాలదు. బలాత్కారమున నైనను క్షణకాలమే నిలచును. అజ్ఞానియగు సన్న్యాసియొక్క చిత్తము బహిర్ముఖముగ నుండును. ప్రాజ్ఞుడగు సన్న్యాసిచిత్తమంతర్ముఖమగును.

**31. నను కామో మోక్షసాధనమిత్యేతదతీవసాహసమ్। కామో హి కేనచిత్ప్రతిహతస్సన్క్రోధాత్మనా పరిణమతే తతో లోభో భవతి। లోభా త్సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశా త్ప్రణశ్యతీతి। తస్మాత్సర్వానర్థబీజభూత ఏవ కామ ఇతి తదుచ్ఛేద ఏవ ప్రయతితవ్యం కుశలేనేతి చేన్నైవమ్। విషయాభిలాషలక్షణకామస్యైవ సర్వానర్థబీజభూతత్వం న తు విషయోపభోగలక్షణస్య। విషయోపభోగోపి విషయాసక్తిపూర్వకస్సర్వానర్థహేతురేవ। కిన్తు యదృచ్ఛాలబ్ధధర్మావిరుద్ధ విషయోపభోగలక్షణః కామో భవతి మోక్షహేతుః। యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సర ఇతి గీతావచనాత్। తస్మాన్ముముక్షర్యదృచ్ఛాలబ్ధం ధర్మావిరుద్ధం కామం సేవేతైవ।**

ప్ర:-ఎన్ని విధముల నిరూపించినను కామము మోక్షసాధనమని గుర్తించుట

మిక్కిలి సాహసముగా నున్నది. కామము ఏకారణముచేతనైన భగ్నమైనచో నది క్రోధరూపముగ బరిణమించును. పిమ్మట లోభముగా మారును. లోభమువలన మోహము, దానివలన చదివిన శాస్త్రముల మరచుట, దానిచే బుద్ధినశించుట, అందువలన వినాశము చేకూరునని భగవద్గీత భోధించుచున్నది. కావున నింతటి యనర్థములకు మూలమైన కామమును సర్వవిధముల బరిత్యజించుట శ్రేయోదాయకము కదా!

*ఉ:-* కామము2 విధములని పూర్వము వచించితిని. 1విషయాభిలాష, 2 విషయానుభవము. ఇందు విషయాభిలాష రూపమైన కామము నీవు చెప్పిన ట్లనర్థముల గొనితెచ్చును. విషయానుభవముతో ననర్థములేదు. ఇదియైనను ఆసక్తితో కూడినయెడల ననర్థహేతువగును. కాని ధర్మావిరుద్ధమైన తనకు లభించిన విషయముల ననుభవించుట యనెడి కామము మోక్షదాయకమగును. జ్ఞాని లక్షణముల దెల్పుచు అప్రయత్నముగ లభించిన ధార్మికవిషయముల ననుభవించుట - శీతోష్ణాది ద్వంద్వములకు లోబడకుండుట-మాత్సర్యము వీడుట మున్నగు గుణములను భగవద్గీత యుపదేశించెను. కావున మోక్ష మభిలషించువాడు అయత్నసిద్ధమైన ధర్మవిరోధములేని కామముననుభవించుటే కర్తవ్యము.

**32. న చ గృహస్థపర ఏవాయం నియమః। యతిస్తు కామం వర్జయేదేవ తాదృశమపీతి చేన్నైవమ్। యతినాపి శరీరస్థితిహేతుభూతః కామస్సేవ్య ఏవ। క్షుత్పిపాసాకులస్య మనః స్వాస్థ్యాసమ్భవాదస్వస్థస్య మనస ఆత్మధ్యానాయోగాచ్చ। న చైవం యదృచ్ఛాలబ్ధా కాన్తాపి యతినోపభోగ్యేతి వాచ్యం, యతేః కాన్తాసమ్పర్కస్య ధర్మవిరుద్ధత్వాత్। ఏవం గృహస్థేనాపి పరదారసమ్పర్కాదికం న కర్తవ్యం తస్య ధర్మవిరుద్ధత్వాత్। యః పునరనవతసమాధినిరతో మహాయోగీ ప్రాజ్ఞస్తస్య తు న కామసేవేతి నేహ స ఉదాహరణమర్హతి।**

*ప్ర:-* ఈ నియమము గృహస్థునకే వర్తించును. యతికెట్టికామమైనను వర్జనీయమే కదా!

*ఉ:-* యతియు శరీరసంరక్షణ చేసికోవలెను. అందుకుగావలసిన కామము సేవింపక తప్పదు. ఆకలిదప్పులు శరీరధర్మములు. అవి పీడించుచుండ మనస్సు కుదుటబడదు. అపుడాత్మధ్యానము సంభవింపదు. కావున నాకలిదప్పు లున్నంత వఱకు యతీశ్వరునకు కూడ ధర్మావిరుద్ధకామము సేవింపవలసినదియే.

ప్ర:- అయత్నముగా లభించిన కాంతను యతియనుభవింపవచ్చునా?

ఉ:- కాన్తాసంపర్కము యతికి ధర్మవిరుద్ధముగాన ననుభవింపరాదు. గృహస్థుడైనను పరకాన్తారతి చేయరాదు. అది ధర్మవిరుద్ధము.

ప్ర:- సమాధినిష్ఠులై సంవత్సరములకొలది పర్వతగుహాలందు మైమరచి యుండు వారెట్టి కామము ననుభవింపరే. అది దోషమా?

ఉ:- వారికి కామసేవతో బనియేలేదు. అట్టిమహానుభావుల విషయమిపుడు చర్చించుట లేదు.

**33. నను విషయేష్వభిలాషాభావే విషయోపభోగో న సమ్భవతి,విషయాన్భున్ -జానస్య చ విషయాభిలాషో బలాదాపతతి। తస్మాదనర్థకర్యేవ విషయసేవేతి చేన్నైవమ్। అజితాత్మన ఏవ కామసేవాऽనర్థకరీ। జితాత్మనస్తు మనఃస్వాస్థ్యాద్యర్థ -కర్యేవ। న హ్యజితాత్మేవ జితాత్మాపి విషయాన్ప్రీతిపురస్సరమ్భుఙ్క్త ఇతి వక్తుం శక్యతే। నను జితాత్మనః కస్మాద్విషయ ప్రీత్యభావ ఇతి చేదాత్మదర్శనసమ్భవాదితి విద్ధి। తథా చ గీతమ్-కృష్ణేన, విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తత ఇతి-**

ప్ర:- మంచిది తక్కినవారు ధర్మసమ్మతమైన ప్రాపంచిక విషయముల సేవింపవచ్చునని యంటిరి. విషయము లననుభవింపవలెననిన వానియం దభిలాష యుండవలెను. ఒకవేళ తొలుతలేకున్నను ననుభవించునపుడైనను నభిలాష పొడమును. కాన నెటుజూచినను ప్రాపంచిక విషయానుభవమనర్థదాయకమని తేలుచున్నదికదా!

ఉ:- ఓయీ ఈ విషయ మిదివఱకే చర్చించితిమి. ఐనను వినుము. మనోనిగ్రహము లేనివానికి విషయానుభవము పాపమునకీడ్చును. నిగ్రహశాలికి అది మనస్సునకు స్వస్థతగూడ కలుగజేయును. వీరిద్దఱియనుభవము చూచుట కొక్కవిధముగ నున్నను లోపల తారతమ్యముండును. ఇంద్రియలోలు డనుభవించు నపుడాసక్తితో భుజించును. నిగ్రహశాలి ఆసక్తిలేక యనుభవించును.

ప్ర:- ఇతని కాసక్తి లేకుండుటకు గారణమేమి?

ఉ:- ఇతనికి ఆనందముదయించినకొలది ఆత్మయొక్క ఆనందమయ స్వరూపము గోచరించుచుండును. గీతా వచనము జూడుము:-

"ప్రాపంచిక విషయములను దరిజేరనీయని వానియొద్దనుండి విషయములే తొలగిపోవుచుండును కాని పూర్వానుభవసంబంధమైన వాసన(రుచి) మాత్రము మిగిలియుండును. ఆత్మదర్శనమైనపిదప ఆ వాసన కూడ నశించును."

**34. న హి పరమానన్దశేవధిమాత్మానం దృష్టవతో దుఃఖమయేషు విషయేషు ప్రీతిరుదియాత్। న చ విషయప్రీత్యభావే విషయభోగ ఏవ దుర్ఘట ఇతి వాచ్యమ్। ప్రీత్యభావేపి కిం తిక్తమౌషధం రోగి న సేవతే? న చ రోగనివారణార్థమౌషధం రోగీ భుజ్క్త ఇతి వాచ్యం, విద్వానపి క్షుణ్ణివారణార్థమోదనం భుఙ్క్త ఇతి తుల్యత్వాత్। అతఏవోక్తం శఙ్కరాచార్యైః ప్రతిదినం భిక్షౌదనం సేవ్యతామితి। నన్వేవం క్రియతామన్నోదకగిళనం యతినేవ గృహస్థేనాపి విదుషా మైథునం తు న కర్తవ్యమితి చేన్మైవమ్। ఋతౌ భార్యాముపేయాదితి శాస్త్రస్యానతి క్రమణీయత్వాత్। స్వబాధాయా ఇవ స్వదారబాధాయా అపి నివారణీయత్వా దృతు కాలికదారకామబాధానివారణార్థం మైథునం కర్తవ్యమేవ గృహస్థేన।**

పరమానందమునకు పరమావధియైన యాత్మస్వరూపము గనుగొనినవానికి దుఃఖమయములగు జగద్విషయములందాసక్తి కలుగదు.

ప్ర:- ఆసక్తి లేనియెడల విషయములు ననుభవించుట దుర్ఘటము కాదా?

ఉ:- ఆసక్తి లేకుండుగాక. రోగపీడితుడు చేదుమందు సేవింపడా?

ప్ర:- అతడు రోగనివారణకై మందు తినును.

ఉ:- జ్ఞానియు ఆకలిరోగమును బాపుకొనుటకై అన్నము భుజించును. "జ్ఞాని కాదలచువాడు రుచులగోరక ఔషధమువలెనన్నము భుజింపవలె" నని శ్రీశంకరాచార్య లుపదేశించిరి.

ప్ర:- అట్లగునేని యతివలె గృహస్థుడు నన్నోదకముల స్వీకరించుగాక! భార్యసంగమము చేయరాదు కదా!

ఉ:- ఋతుకాలమున భార్యాసంగమము చేయవలెననెడి ధర్మశాసన మతిక్రమింపరానిది కాన అది కర్తవ్యమేయని గుర్తింపవలెను. అదియుగాక ఒరుల బాధయు దనబాధవంటిదే కావున ఋతుకాలమున భార్యకుగలిగిన కామబాధ నివారింపదగినదియే.

**35.** **న చైవం సన్న్యాసినాపి తదర్థం తత్కర్తవ్యమేవేతి వాచ్యం, సన్న్యాసినో దారాణామేవాభావాత్। దారానయం హి విధినా సన్న్యస్తవాన్। న హ్యుద్వాన్త మన్నం పునర్భోజనాయార్హమ్-నన్వేవం కస్తస్యా ఋతుకాలికబాధానివారక ఇతి చేదతఏవ దారానుజ్ఞయైవ సన్న్యసితవ్యమితి విహితమ్। ఏతేన స్వదారాణాఞ్చ యౌవనదశాతిక్రమఏవ సన్న్యసితవ్యం కుశలేనేతి సూచితమ్।**

*ప్ర:- అయిన, సన్న్యాసికూడ ప్రవర్తింపవచ్చునే!*

*ఉ:- సన్న్యాసికి భార్య యెక్కడిది? అతడు శాస్త్రవిధితో భార్యను విడనాడి యుండెను. కక్కినకూడుతినదగినది కానేరదు.*

*ప్ర:- అటులైన నామెకు ఋతుకాలపు కామబాధ తీర్చువారెవరు?*

*ఉ:- భార్యయొక్క యనుమతిపొందియే సన్న్యాసము స్వీకరింపవలెనని శాస్త్రము తెల్పుచున్నది. ఋతుకాలవుకామబాధ తీరిననేగాని యామె యనుమతింపదు. తనకును భార్యకును యౌవనము గడిచిన పిమ్మటనే సన్న్యాసము స్వీకరింపవలెనని శాస్త్రాభిప్రాయము.*

**36.** **అథవా విధవాయాః కామబాధాం యో వారయతి స ఏవ యతి భార్యాయా అపీతి బోధ్యమ్। న చ విధవాయాః పునరుద్వాహో విహితఇతి వాచ్యం యతిభార్యాయా అపి స విహిత ఏవ "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ, పఞ్చస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే" ఇతి పరాశరస్మృతేః । అథ యది "ఊఢాయాః పునరుద్వాహో జ్యేష్ఠాంశో గోవధస్తథా, కలౌ పఞ్చ న కుర్వీత భ్రాతృజాయా కమణ్డలు" రితి స్మృతేర్విధవోద్వాహో యుగాన్తర విషయ ఇత్యుచ్యతే, తర్హి యతిభార్యోద్వాహోపి తథైవ, ఊఢాత్వా విశేషాత్। అస్మిన్ పక్షే కః పునర్విధవాయాః కామబాధా నివారకః. నను బ్రహ్మచర్యమేవ తదనుత్పాదకమితి చేత్తథా యతిభార్యాయా అపీతి విద్ధి। బ్రహ్మచర్యం చైకవారాశనాధశ్శయనాదిలక్షణమిత్యన్యత్ర విస్తరః।**

*వితంతువులు కామమును జయించినట్లే యతిపత్నులు గూడ జయింపవలెను। విధవావివాహమును పరాశరస్మృతి విధించినను అయ్యది కలియుగమునకు పనికిరాదని మఱియొక విశేషవిధి కనుపించుచున్నది. కావున వితంతువుగాని యతిపత్నిగాని ఒంటిపూటతిండి, నేలపడక మున్నగులక్షణములుగల బ్రహ్మచర్య*

వ్రతమవలంబించి జీవితము గడుపవలెను.

**37. తస్మాద్యతీనామివ సాఙ్ఖ్యానాం గృహిణామపి యోగినామ్మోక్షస్సిద్ధ ఏవ। "యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే, ఏకం సాఙ్ఖ్యఞ్చ యోగఞ్చ యః పశ్యతి స పశ్య"తీతి గీతావచనాత్।**

యతీశ్వరులకు వలెనే ఆత్మవిచారముగల గృహస్థులైన యోగులకు గూడ మోక్షము సిద్ధమే. సాఙ్ఖ్యులకు లభించుపదవి యోగులకును లభించునను గీతావాక్యమున కిదియే యర్థము. సాఙ్ఖ్యయోగములనొక్క రీతిగా తలచువాడే జ్ఞానియనియు నచ్చటనే తెలుపబడెను.

**38. న చ యమనియమాదిలక్షణాష్టాంగయోగో న గృహస్థవిషయ ఇతి వాచ్యం,తస్య గృహస్థావిషయత్వేపి "యోగః కర్మసు కౌశల" మిత్యుక్తలక్షణ యోగస్య గృహస్థవిషయత్వాత్। కర్మసు కౌశలఞ్చ ఫలాభిసన్ధి మకృత్వా ఈశ్వరేణ విహితమితి బుద్ధ్వా సిద్ధ్యసిద్ధ్యోస్సమీభూయ స్వ కర్మానుష్ఠానమ్ యదృచ్ఛాలబ్ధ ధర్మావిరుద్ధ విషయ సేవాప్యత్రైవాన్తర్భూ తేతి నా ప్రసక్తిదోష। నను నిష్కామనియతకర్మానుష్ఠానలక్షణే కర్మయోగే కథం కామసేవాయా అన్తర్భావ ఇతి చేదుచ్యతే। యజ్ఞశిష్టామృతాశన లక్షణకామసేవాయాస్సత్త్వా త్తస్మిన్నితి। భగవద్విషయోపభోగలక్షణ కామసేవాయాస్సత్త్వాచ్చ తస్మిన్నితి। అస్యైవ విద్వదాశ్రయస్య కర్మయోగస్య రాజయోగ ఇతి వ్యవహారః ఏనమేవాశ్రిత్య జనకాదయో ముక్తిం గతాః తస్మాన్ముముక్షురాశ్రయేత రాజయోగమ్। అథ సుఖావబోధాయ రాజయోగం బ్రవీమి పునః॥**

*ప్ర:- యోగమన యమనియమాసనప్రాణాయామాదులుగల యష్టాంగ యోగము కదా! అది గృహస్థులకు వర్తించునా?*

ఉ:- యోగమన నదియొక్కటియేకాదు. "కర్మలనాచరించుటయందుగల నేర్పు యోగ" మనిభగవద్గీత నిర్ణయించెను. ఈయోగము గృహస్థులకు వర్తించును.

*ప్ర:- అది యెట్టి నేర్పు?*

ఉ:- వినుము: సాధరణమగ నెవ్వడేపని జేసినను దాని ఫలితమును గూర్చి యాశించుచు నందుదిగును. అటులగాక ఫలితమును గూర్చి యాశజెందక దానిని భగవంతునకు వదిలివేయుచు "నీశ్వరాజ్ఞచే నేనీకార్యమును జేయుచుంటి" నని

తలంచుటయే కార్యాచరణమందలి నేర్పు. ఫలించినను లేకున్నను ఒక్కరీతినుండును. భగవద్గీత దీనికే యోగమని వ్యవహరించెను. అప్రయత్నముగా లభించిన ధర్మసమ్మత విషయముల ననుభవించుటయు నీయోగముననే చేరును.

ప్ర:- కర్మానుష్ఠానరూపమైన యోగములో విషయానుభవరూపమైన కామ మెటుల జేరును?

ఉ:- భగవంతుని నారాధించిన పదార్థములసేవించుటయు కర్మాచరణమే గాన నీయోగమున జేరును. జ్ఞానులాచరించు నీకర్మయోగమునకే రాజయోగమని పేరు। దీనినాశ్రయించియే జనకాదులు మోక్షసామ్రాజ్య మధిష్ఠించిరి। కావున మోక్షేచ్ఛ గలవారు దీనినాశ్రయింపనగును. రాజయోగమును గూర్చి సులభముగ నెఱుంగనట్లింకను జెప్పెద వినుము:-

**39. ఫలాభిసన్ధిం విహాయ నియతకర్మానుష్ఠానమ్, దేశే కాలే పాత్రే చ ఫలమనభిసన్ధాయ ద్రవ్యవితరణమ్, సచ్ఛిష్యేభ్యోన్నవిద్యాదానం, యతి బ్రహ్మచారిభ్యః పక్వాన్నప్రదానం "యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్నస్వామి నావుభా" వితి వచనాత్, యజ్ఞశిష్టామృతభోగః "యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మసనాతనమితి గీతావచనాత్, యజ్ఞాశ్చ దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ బ్రహ్మయజ్ఞాదయః అగ్నిష్టోమాదయశ్చ, భక్తిపురస్సరం భగవన్ని వేదిత స్రక్చందనాదిధారణం, భగవన్నామగుణ కథానాం గానం శ్రవణఞ్చ, భాగవతాదిసద్గ్రన్థకాలక్షేపః ఋతుదారగమనమ్ నిశి స్వాపః జయన్త్యా మేకాదశ్యాఞ్చోపవాసః ద్వాదశ్యాదౌ బ్రాహ్మణేభ్యోన్నదానమ్ గురుశుశ్రూషా సాధుసేవనమ్ యదృచ్ఛాలాభసన్తుష్టిః నిర్వృత్తికత్వే శిలోఞ్ఛయో ర్భిక్షాయా వాస్వీకారః ద్వన్ద్వసహనం సర్వత్రసమబుద్ధిఃప్రశాన్తిరాత్మజయః జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహిత ఇతి గీతావచనాత్। సత్యాం కవనధోరణ్యాం భాగవతగ్రన్థరచనా వ్యాఖ్యానకౌశల్యాం భాగవతగ్రన్థవ్యాఖ్యానమ్।**

ఫలితము నాసింపక తనకువిధింపబడిన కర్మలనాచరించుటయే రాజయోగము. ఆకర్మము లెట్టివన-దేశకాలపాత్రములను గుర్తించి ఫలమపేక్షింపక ద్రవ్య మొసంగుట, యోగ్యులైన విద్యార్థుల కన్నదానము విద్యాదానము సేయుట, యతియు బ్రహ్మచారియు గృహస్థుని యన్నముపై నధికారులని చెప్పినట్లు వారికి భిక్షనొసంగుట: భగవద్గీత యుపదేశించినటుల మోక్షదాయకమైన భగవన్నివేది

తాన్నమును (యజ్ఞశిష్టామృతమును) భుజించుట, పంచమహాయజ్ఞములను, అగ్నిష్టోమాదియాగములను ఆచరించుట, భగవంతునకు ధరింపజేసిన పుష్పములను చందనము-అగరు మున్నగువానిని ధరించుట, భగవన్నామము చేయుట-ఆతని గుణగణముల గీర్తించుట: హరికథలవినుట-భాగవతము మొదలైన యార్ష గ్రంథముల జదువుట: ఋతుకాలమున ధర్మపత్నితో రమించుట, రాత్రులందే నిద్రించుట, జయన్తి, ఏకాదశి మున్నగుపర్వములం దుపవసించుట: ద్వాదశియందు బ్రాహ్మణుల కన్నదానము చేయుట, గురువులసేవించుట: సత్పురుషులను గొల్చుట, ప్రాప్తించిన దానితో తృప్తి చెందుట,జీవయాత్ర జరుగనిచో శిలోంఛవృత్తులవలనగాని, భిక్షావృత్తి వలనగాని జీవించుట, శీతోష్ణములు- మానావమానములు మున్నగు ద్వన్ద్వములను సహించుట: శత్రుమిత్రాదుల నొక్కరీతిగా జూచుట, చిత్తశాంతి జెందుట, "ఇంద్రియముల నిగ్రహించి చిత్తశాంతిం బొందుచో పరమాత్మ సమీపించు"నని గీత చెప్పినట్లింద్రియనిగ్రహము జేయుట, కవిత్వధోరణియున్న యెడల భగవన్తునిగూర్చిన గ్రంథముల రచించుట: వ్యాఖ్యానము వ్రాయుటయందు నేర్పుకలదేని భగవత్సంబంధముగల గ్రంథములను వ్యాఖ్యనించుట:

**40. సత్యభాషణం హితోపదేశః పరమాత్మచిన్తనం తత్త్వవిచారః పరోత్కర్ష సహిష్ణుత్వం క్షమా విపది ధైర్యం, సమ్పది గర్వాభావః అమానిత్వ మదమ్భిత్వం శౌచం ధర్మద్వైధే శిష్టాచారానుసరణమ్, అవిగీతాచారా పరిత్యాగః అసత్సంసర్గా -భావః దేవవన్మాతుః పితుశ్చ పూజనమ్, సతి నిమిత్తే నైమిత్తికస్య నిష్కామ మనుష్ఠానమిత్యాదిః। అస్య చ రాజయోగస్యానుష్ఠా నాత్సత్త్వశుద్ధిం ప్రాప్య, పరమాత్మానం విదిత్వా, దేహీ ముచ్యతే "దేవం మత్వా హర్షశోకౌ జహాతి, తరతి శోకమాత్మవి" దిత్యాది శ్రుతిభ్యః।**

సత్యముపల్కుట, ఒరులకు హితముపదేశించుట: ఈశ్వరునిధ్యానించుట: పరమాత్మతత్త్వమును గూర్చి యాలోచించుట, ఇతరుల గొప్పతనమునుజూచి హర్షించుట, ఒర్పు, కష్టములందు ధైర్యము, ఐశ్వర్యముకల్గినపుడు గర్వింపకుండుట, గౌరవమునకై యెదురు చూడకుండుట, తానొనర్చిన ధర్మకార్యముల బ్రకటింప కుండుట, శుచిగానుండుట ధర్మవిషయమున సందియము వచ్చినపుడు శిష్టుల యాచారము ననుసరించుట, వంశపారంపర్యముగ వచ్చు నాచారము విడనాడ కుండుట, దుస్సాంగత్యము సేయకుండుట: తల్లిదండ్రులను దేవునివలె పూజించుట, సూర్యగ్రహణమునకు స్నాన మొనర్చునటుల ఒక విశేషమున్నపుడు తత్సంబంధమగు

కర్మను ఎట్టి ఫలమాసింపకయే యాచరించుట.

ఇవ్విధమగు రాజయోగము ననుష్ఠించుట వలన నంతఃకరణమున సత్త్వ గుణము పెంపొందును. అటుపై నాత్మతత్త్వజ్ఞానముదయించి జీవుడు ముక్తిబడయును. "తరతి శోకమాత్మవిత్" ఇట్టి యనేక శ్రుతివాక్యములలో జెప్పినటుల నాత్మతత్త్వమును గుర్తించినవాడు గర్భజన్మజరామరణాది దుఃఖ పూరితమగు సంసారమును తరించి సచ్చిదానందస్వరూపుడగును.

శ్రీ బెల్లంకొండరామకవిచే రచింపబడిన
'కామమీమాంస' సంపూర్ణము.

శ్రీ హయగ్రీవార్పణమస్తు!

త్వరలో...

# శారీరకమీమాంసాచతుస్సూత్రీ

- సంస్కృతమూలమ్ -

శ్రీ బెల్లంకొండ రామరాయకవీన్ద్రః

- ఆంధ్రానువాదము -

డాక్టర్ మల్లాది గోపాలకృష్ణశర్మ, ఎమ్.ఏ(త్రయ), పిహెచ్.డి., డి.లిట్(సంస్కృతం)

"విమర్శకాగ్రేసర', 'వైదిక-లౌకిక సాహిత్యాలఙ్కార", వైదికధర్మప్రవక్త,

సనాతనవైదికధర్మపీఠం, హైదరాబాద్.

86



- నివాళి -

పంగనామములద్ది 'వైష్ణవరాముడై'
తులసీవనములోన నిలిచినాడు,
శాస్త్రసాహితులలో ఛాత్రాభిరాముడై
'గురు చక్రవర్తియై' మెఱసినాడు,
అల, శ్మశానము వద్ద 'అలరు చింతల' మధ్య
బ్రహ్మచింతనతోడ పఱగినాడు,
శ్రీ హయగ్రీవుని చిత్తమ్ములో నిల్పి
'నిర్మల స్ఫటికమై' నిలిచినాడు,
అట్టి 'బెల్లపుగొండ' ను పట్టి నట్టి
పమిడిపాటికి 'చీమనై' ప్రణతి సేతు
అట్టి మహనీయుడైన 'బ్రహ్మణ్యమూర్తి'
తనువు తాకిన 'శేషుబావి' ని దలంతు.

- మేళ్ళచెర్వు

ముద్రణ : కమల ఆర్ట్ ప్రింటర్స్, Ph. : 225072